శ్రీ

# పంచతంత్రము.

లేఖకప్రమాదాదిదోషంబులు

లేకుండునటుల బరిష్కరింపఁబడి

పూర్వకథలకుం గొన్నివిచిత్రమైనకథలు జేర్చి

సంస్కృతాంధ్రపాఠశాలలవిద్యార్థులకుమిగుల

నుపయుక్తమగునటుల.

వేలటూరి * రాఘవయ్యచేత

శారదానిలయమనుస్వకీయముద్రాక్షరశాల

యందచ్చువేయించి

ప్రకటింపఁబడియె.

౧౮౭౪ సం॥ జూన్ నెల ౨౯ తేది

శ్రీరస్తు.

## సూచిక

సూచిక-



౬౧ పేజి మొదలు౮౦ పేజీవరకు-సంధివిగ్రహతంత్రముఅను హెడ్డువుండవలసినందుకు పొరపాటునసుహృల్లాభతంత్రమను హెడ్డువేసియున్నదిగనుక బుద్ధిశాలులుదాన్ని తెలిసికొనట్లు హెచ్చరించుచున్నాము-

శ్రీరస్తు

# పంచతంత్రము

పాటలీపురమను ప్రసిద్ధంబైనయొక పట్టణము గలదు - అది వేదశాస్త్ర పురాణాది చతుర్దశవిద్యలు నేర్చిన బ్రాహ్మణోత్తముల చేతనున్ను మిక్కిలిబలపరాక్రమశాలులయిన రాజశ్రేష్ఠుల చేతనున్ను క్రయవిక్రయములయందు ప్రసిద్ధులైన వైశ్యుల చేతనున్ను దేవబ్రాహ్మణ విశ్వాసము గలిగి యుండెడు శూద్రుల చేతనున్ను నానావిధములయిన ఆయుధవిద్యల నభ్యసించుటయందు నేర్పుగల వీరభటుల చేతనున్ను - అనేక దేవాలయముల చేతనున్ను ప్రకాశింపుచుండును-

ఆపట్టణము సుదర్శనుండను రాజు యేలుచుండును - అతడు పరాక్రమమునకుమారస్వామితోనున్ను బుద్ధియందు బృహస్పతితోనున్ను ధైర్యంబున హిమవంతునితోనున్ను దాతృత్వమునందు శిబికర్ణదధీచులతోనున్ను సమానుండై యిజ్జగంబున ప్రసిద్ధికెక్కియుండెను.

ఆరాజశ్రేష్ఠుండొక్కనాడు మంత్రులు పురోహితులు విద్వజ్జనంబులు సామంతరాజులు బంధువులు మిత్రులును పరివేష్టించియుండగా సభలో నిండుకొలువుండి - దుర్మార్గులై నీతిశాస్త్రము తెలియని తనకొడుకులంజూచి మిక్కిలి చింతాక్రాంతుండై - సభలోనున్నవారితో నిట్లనియె

విద్వాంసుడున్ను ధార్మికుడున్ను కానికొడుకు పుట్టితే ఫలమేమి చూడిపాడిలేని గోవును పెట్టుకొని యేమి చేయవచ్చును - బహుమంది కొడుకులు గలరని లెక్క పెట్టుకొనుటచేత కొంచమైనా ప్రయోజనము కద్దా వంశమునకు కీర్తి తెచ్చిన కుమారుడు ఒక్కడే చాలును రూపమున్ను ధనమున్ను బలమున్ను కలిగినా శాస్త్రజ్ఞానము లేని కొడుకెందుకు అటువంటి కొడుకును గనుటకంటే తల్లిగొడ్రాలైనా మేలు - కడుపుదిగబడినా మంచిదే - పుట్టినవాడు చచ్చినా బాగు ఆడదిగా బుట్టినా వాసి - పూర్వ జన్మములయందు తండ్రి చేసిన పుణ్యకర్మము చేత ఉదారుండును ధర్మాత్ముండును తల్లిదండ్రుల మాట జవదాటనివాడును మంచినడత గలవాడును - సర్వజనహితుండును విద్వాంసుండును సమర్థుండును - ఒకరు తనకు చేసిన మేలు మరవనివాడును ఆడితప్పనివాడునైన పుత్రుండు గలుగును పాపకర్మము చేత పాలసముద్రములో విషము పుట్టినట్లు

మంచివంశములో మూర్ఖుడు పుట్టిన కులము చెడును యౌవనము ధనము దొరతనము అవివేకము అనుయీనాలుగింటిలో ఒకటొకటే అనర్థమునుపుట్టించును ఈనాలుగున్ను కలిగినచోట చెప్పవలసినదేమి. కాబట్టి వివేకము లేనందున మూర్ఖులైన నాకొడుకులకు నీతిశాస్త్రము చదివించి వివేకము కలుగ జేయుటవలన వారిని పునర్జన్మ సంభూతులుగా జేయగలుగు విద్వాంసులెవరైనా యీసభయందుగలరా.

అని రాజు చెప్పగా దేవగురువైన బృహస్పతివలెను సమస్తనీతిశాస్త్రములు తెలిసిన విష్ణుశర్మయను బ్రాహ్మణుడు లేచి రాజునుజూచి ఓ మహారాజా మీరీలాగున చింత చేయవలసినదియేమి - మిగుతలవినపని చక్కగా చేయుటయెంత మాత్రము. నేను మీకొడుకులనందరిని ఆరు నెలలలో సకలనీతిశాస్త్రము తెలిసిన వారినిగా జేసి మీకు సమర్పించకపోతే ధనధాన్యములతో నాయిల్లు విడిచిపెట్టి మీ రాజ్యమునకు దూరముగా బోగలవాడనని ప్రతిజ్ఞ చేసెను

అందుకు రాజు చాలాసంతోషించి ఆవిష్ణుశర్మకు యేనుగులు - గుఱ్ఱములు తేజీలు పల్లకీలు గొప్ప వెలగలిగిన వస్త్రములు సొమ్ములు మొదలుగాగల వస్తువులు బహుప్రీతితో బహుమానము చేసి తనకొడుకులను పిలిపించి అయ్యా ఇదుగో వీండ్లు మీకొమాళ్లు గాని నాకొమాళ్లు గారు మీరు వీండ్లను చదివించి బుద్ధిమంతులను చేసే భారము మీది అని వారిని విష్ణుశర్మవశము చేసెను

అంతట విష్ణుశర్మ రాజపుత్రులను పిలుచుకొనిపోయి తనమనస్సులో ఆలోచన చేసి మిత్రభేదము - సుహృల్లాభము - సంధివిగ్రహము - లబ్ధనాశము - అసంప్రేక్ష్యకారిత్వము - అని అయిదుతంత్రములుగల పంచతంత్రమనే గ్రంథము చేసి వారితో నిట్లనియె

మిత్రభేదమనగా స్నేహితులకు విరోధము పుట్టించడము. సుహృల్లాభమనగా స్నేహితులను సంపాదించుకోవడము. సంధివిగ్రహమనగా ముందుగా స్నేహము చేసి తర్వాత విరోధించడము. లబ్ధనాశనమనగా దొరికిన ధనమును పోగొట్టుకోవడము. అసంప్రేక్ష్యకారిత్వమనగా ఏకార్యమునైనా చక్కగా విచారించక చేయడము

పంచతంత్రమనగా ఈ అయిదుతంత్రములుగల గ్రంథము.

ఒకవనములో నొకసింహమును వృషభమును చాలా స్నేహము గలిగి యుండగా మిక్కిలి తంత్రముగల ఒకనక్క కొండెములు చెప్పి ఆ రెంటికి విరోధములు పుట్టించి సింహము చేత వృషభమును చంపించెను

అని చెప్పగా రాచకొమాళ్లు విని మొదట సింహమునకును వృషభమునకును స్నేహ మెట్లా కలిగెను తర్వాత ఆ స్నేహము చెడి విరోధ మెట్లా వచ్చెను యిదియంతయు సవిస్తరముగా జెప్పవలయునని విష్ణుశర్మ యిట్లనియె

దక్షిణదేశమునందు బహుమంది ధనికులు గల మహిళాపురమను పట్టణముగలదు అందు బహుసంపత్తు గలిగిన వర్ధమానుండను పేరుగల ఒక వర్తకుడు గలడు - అతడు నిండా ధనము గలవాడైనా తన ధనమును వృద్ధిబొందించవలెనని తలంపు గలిగి యిట్లని యోచించెను - ధనము లేకుంటే ఆర్జించవలయును ఆర్జించిన ధనమును - రక్షించవలయును రక్షించిన ధనమును - వృద్ధిబొందించవలయును - వృద్ధిబొందించిన ధనమును - సద్వినియోగము - చేయవలయును ఇట్లు చేయ నేరని వాని యింట ద్రవ్యమెట్లు నిలుచును - మూఢులయిన వారు ఈ యర్థమును తెలియ నేరరు - సంరక్షణ చేయని ద్రవ్యము అప్పుడే నశించును - వృద్ధిబొందించని ధనము కొంచెముగా వ్యయము చేసినా కాటుకవలెనె మసిపోవును అనుభవమునకు రాని సొమ్ము కలిగియు లేనిదానివలెనె సుఖకరము గాదు - ఒకరికివ్వడము తాననుభవించడము ఏవరైనా యెత్తుకొనిపోవడము ఈ మూడున్ను ధనము పొయ్యేటందుకు దోవలు - కాబట్టి యెవడు తన ధనమును ఒకరికివ్వక తానున్ను అనుభవించడో వాని ధనమును యెవరైనా యెత్తుకొని పోదురు - నిండిన చెరువులకు అలుగులు తీసినట్లు సంపాదించిన ధనమును పాత్రమెరిగి వ్యయము చేయుట రక్షించడమేను

అని వర్ధమానుడు చాలా యోచన చేసి తన యింట నున్న కుంకుమపువ్వు గోరోజనము కస్తూరి ముత్యములు బవడములు రవలు కెంపులు పచ్చలు వైడూర్యములు గోమేధికములు పుష్యరాగములు అపరంజి వెండి పట్టుచీరలు సరిగెదుప్పట్లు నానావిధములైన శాలువలు మొదలగు వెలబోడుగు వస్తువులనొకబండిమీద నెక్కించి ఆబండికి సంజీవక నందకములనే పేరుగల రెండెద్దులగట్టించి బండిసాగించుకొని కావలసిన పరివారముతో కూడా వర్తకము చేయుటకై పరదేశమునకు బైలువెళ్లెను - అప్పుడు బండి నిండా బరువైనందున మహా[illegible]

ననొకయరణ్యములోబడ్డు మెరకనేలను మోకాళ్లువిరగబడినసంజీవకుని జూ
చివర్తకుడు కొంతసేపు చింతించి తర్వాత ఆబండిమీదిసరుకులన్నియు మనుష్యు
లచేత యెత్తించుకొని పడియున్నసంజీవకుని కాళ్లకు కట్లుగట్టించి - ఆయెద్దుమీ
దిప్రీతిచేత కొందరిని అక్కడ కావలియుంచి అవతలసాగిపోయెను

తర్వాత అక్కడ కావలియుండినవారు మనము ఈ భయంకరమైన అర
ణ్యములోనుండి చావవలసినదేమి పోదాము అని అతిత్వరితముగా బోయి ప్రభు
వును జూచి స్వామీ మేము ఆవనమునందు వృషభమునకు కావలియుండగా యె
క్కడిదో యొకపులివచ్చి సంజీవకుని జంపి యీడ్చుకొనిపోయెను మేము తప్పిం
చుకొని మీసన్నిధానమునకు వచ్చితిమి మీతో యీమాట చెప్పుటకు సిగ్గవుచు
న్నది- అని మహాభయభక్తులతో జెప్పిరి -

అక్కడ ఆ సంజీవకుండు ఆయుస్సుకలిగియుండుటచేత విరిగినకాళ్లు నా
నాటికి చక్కగా వచ్చినందున మెల్లమెల్లగా లేచి తిరుగులాడుచు లేతపచ్చిక మే
యుచు తియ్యని నీళ్లు తాగుచు బళ్లెరుగని సత్తువబట్టి కొంచమైనా భయము లేక
ఒకనాడు పెద్దరంకె వేసెను ఆవనములో పింగళకుండను నొకసింహము పులు
లు- అడవిపందులు- యెలుగుగొడ్లు- అడవిదున్నలు- యేనుగులు- ఖడ్గమృగము
లు- దుప్పులు- లేళ్లు మొదలైనసకలమృగములను శిక్షింపుచు రక్షింపుచు యెదు
రులేని భుజబలముచేత గర్వించి స్వేచ్ఛగా దిరుగుచు తనపరాక్రమముచేత
సంపాదింపబడ్డ రాజ్యము ననుభవింపుచుండెను- ఆసింహము నాడు దప్పచేత
డస్సి నీళ్లు దాగుటకై యమునానది రేవులో దిగుచుండి మహాభయంకరమై ప్ర
ళయకాలమేఘము వల్ల బుట్టిన యురుముతో సమానమైన సంజీవకుని రంకె విని
మిక్కిలి దిగులుపడి యిదియేమి యిక్కడ యెవరున్నారు అని తనలో తాను ఆ
లోచన చేయుచు అవతలసాగిపోక నిలిచెను- అప్పుడు పింగళకుని మంత్రికుమా
రులైన కరటకదమనకుల నే పేరుగల నక్కలలో దమనకుడు తమప్రభువైన పిం
గళకుడ నే సింహరాజు వృషభము యొక్క రంకె విని జడిశిన తెరంగెరింగి కరట
కునిం జూచి చూచితివా కరటకుడా ఇంత గొప్పవాడైన మనరాజు వింతయైన శ
బ్దము విని నదికి నీరు ద్రావబోవ వెరచెను మనము అతని మంత్రికుమారులమై యుం
డి యుపేక్షించుట యుచితము గాదు అతని దగ్గిరికి పోయి వెరచుటకు కారణమే
మని విచారించి అతని జడుపు దీర్చుదము అనిన కరటకుండిట్లనియె-

ఓ వెఱ్ఱివాడా దోవను పొయ్యే వ్యాజ్యము కొని తెచ్చుకొన్నట్టు మనకి

టువంటిపను లెందుకు భగవంతుడిచ్చి నమట్టుకు భక్షించి సుఖముగానుండు
దము ఇటువంటిపనులకుబో తేమన కేమి మోసము వచ్చునో తెలియదు-అధిక
ప్రసంగములకు బోయినవాడు మేకునూపి చిక్కినకోతివలె నిజముగా హానిబొం
దును అదెట్లనిన

దమనకునకు కరటకుడు చెప్పెడు కోతికథ

ఒకపట్టణమునకు సమీపముగా నొకగొప్ప దేవాలయము జీర్ణమై సగము
నేలంబడియుండగా దేవభక్తిగల వైశ్యుడు దానిని మునుపటివలె నే చక్క
సేయుండదలచి శిల్పకారులకు కొంతధనమిచ్చెను వారు ఆధనము తీసుకొని ఆగుడి
కట్టుచుండే సమయములో నొక దేవదూలము పలకలుగా గోయుచు అది చీలు
టకై అక్కడక్కడ మేకులు దిగగొట్టి యింతలో ప్రొద్దు గూకినందున తమయిం
డ్లకు పోయిరి- అప్పుడు సమీపవృక్షముల నాశ్రయించి తిరుగుచున్న కోతులు దే
వాలయము దగ్గిరకి వచ్చి యెక్కిన చెట్లపైకి దుప్పించి దూకుచు చెట్లపైనుండి
దాటుచు గొప్ప కొమ్మలనూగులాడుచు ప్రాకారములపాకి పరుగులెత్తుచు
గోపురంబులమీద కూర్చుండుచు గోళ్లతో పక్కలు పీపులు గోకుకొనుచు నిక్కు
చు కనుబొమలెత్తి వెక్కిరించుచు పండ్లిగిలించుచు ఒకదానితో నొకటి జగడ
మాడ ఓడిపోవుచు పండ్లు భక్షింపుచు తేనెలు త్రావుచు స్వాభావికమైన చప
లత్వము చేత తిరుగుచుండెను- అందులో నొక ముసలికోతి దైవవశము చేత మే
కులు గొట్టియున్న దేవదూలము దగ్గిరికి వచ్చి వృషణంబులు నెరియలో వ్రేలా
డ వేసుకొని దాని మేకు రెండు చేతుల బట్టి బలవంతముగా నూడబెరికెను- అంత
ట వృషణంబులు నెరియందు నిరుకుకొనిన నిగినందున నా కోతి మొరపెట్టుచు
నా వేదనచేత మృతిబొందెను కాబట్టి యీ ప్రకారముగా తనకు నిమిత్తము లేని
పనికి జొచ్చినవారికప్పుడే చెప్పిన కోతివలెనే అవును- మనకు అది విచారించ
వలసినపని యేమి-మనదొర భక్షింపగా మిగిలిన మాంసము భక్షింతము రమ్మ
నిన దమనకుండిట్లనియె-

మిత్రులకు నుపకారంబును శత్రులకు నపకారంబును జేయుటకై లోకము
లో వారు రాజులను గొల్తురు గాని తమ కడుపు పోషించుకొనుటకు గాదు- అం
దుకై గొల్చుటకంటె నుచచ్చుట మేలు అటువంటివాడు చచ్చినా భూమికి వెలి
తియవునా ఒకనివల్లన నేకులు జీవించడము లేకుంటే వాని జన్మ మెందుకుము

క్కనబొక్కుచుక తినెకొంగతనకడుపునిండించుకొలేదా అదియునుంగాక
కొంచము మెదడుగలకరినమైనయెముకదొరికి నాకుక్కసంతోషపడుచున్న
ది అందువల్లదానియాకలిగూడాతీరదు - సింహమైతే అల్పమృగముసమీప
మునకువచ్చి నాదానివిడిచిమదించినయేనుగనుచంపిదానికుంభస్థలమందలి
మెదడుభక్షింపగోరును హీనులునధికులునైనసకలమానవులుతమతమబలా
నుసారము కార్యములుచేయగోరుదురు అటువలెనీవున్ననీబలానికితగిన
ట్లుచేయదలంచితివి కుక్కతనకు ఆహారమిచ్చేవానిదగ్గిరతోకను
లుచుకొనును నేలకాళ్లనడుమును భూమిమీద పడికడుపునోరుచూపించును
యీప్రకారముయెన్నిపాట్లుపడినాకుక్కకొక్కముద్దయన్నమేకానికడుపు
నిండ పెట్టరు యేనుగ బహుధైర్యముతో చూచుచుండును మంచిమాటలతో చె
ప్పితేనే కాని అహారము తీసుకొనదు దానికి కావలసినంతఆహారమిత్తురు హీను
లైనవాడు ఎంతదీనుడై యడిగినా వానికెవరున్ను యివ్వరు - ఒకవ్యాళ
యిచ్చినాకొంచమే యిత్తురు అధికునకైతే వాడడుగకున్నా రాజులు వాని
కాంతకీరనిత్తురు ఘనమైనవిద్యచేతనుపరాక్రమముచేతనుఉపాయముచే
తనురాజులుచూచిమెచ్చ బ్రతికినదేబ్రతుకు గాని నీచపుబ్రతుకెందుకు కుక్క
యల్లప్పుడున్ను తోకయాడించుచుకమికెవుకూడుతెననెతినుచున్నది పౌ
రుషముచేత జ్ఞానముచేతను కీర్తిచేతను ప్రసిద్ధికెక్కినవాని సంపదఒక్కపూ
టనిలిచినాచాలును తనకడుపుమాత్రమే నిండించుకొనె కాకిబహుకాలము
బ్రతికియుండినాఫలమేమి కొంచంనీళ్లచేత మొరపనెలవాగుపొర్లిపారినట్లు
స్వల్పఫలముచేత నెఱిబ్బిచుమిక్కిలిసంతోషమునుబొందును ఇదిహిత
ము ఇదిహితముకాదుఅనెవివేకము లేకఅనేకములైనవేదోక్తాచారములును
విడిచితనకడుపుమాత్రమే నిండించుకొను టయందుయిచ్ఛగలనరుడుపశువు
తో సమానుడు భారముగలబండిలీడ్చుచుగడ్డి మేయుచుమిట్టపల్లములుగానుం
డేస్థలములయందుదున్నదుసీప్రకారముగాలోకమునకుఉపకారముచేయు
చుపవిత్రమైనపుట్టుకగలవృషభమునరపశువుకంటేఅధికము - అనినవినిఓ
యీమనముప్రధానులముకాముకాబట్టి యీపనులకున్ను అర్హులముగాము
మనకిన్ని నీతులతోపనియేమిఅనికరటకుడుపలికినవెండియు దమనకుడిట్లనియె

పూర్వజన్మమునందు చేసినపుణ్యముచేతబుద్ధిగలవాడగునుబుద్ధి బలము

చేతరాజులచేతపూజ్యుడగును-రాజులుమన్నించుటచేతబుద్ధికిప్రకాశముగ
లుగునుఅందువల్లరాజ్యతంత్రమునడుపుటకుప్రధానుడగునుప్రధానత్వము
వచ్చినసమస్తముగలుగునుఅప్రధానుడుప్రధానుడుకావడానకెట్లంటేనే
ప్పుపట్టునువారియీనునడవడికయుండిదిగానుండినా జనులువానిగొప్ప గా
జూతురుఆనడవడిచక్కగానిదిగాకపోయినావానిచుట్టమ్ములైననువానిచి
ల్లగాజూతురుగొప్పతనంబునుచిన్నతనంబును-నడవడికచేతవచ్చును- ఒక
పెద్దరాయిమహాప్రయత్నముచేతకొండమీదికితీసుకొనిపోవుటప్రయాసము
ఆరాయిఅక్కడినుంచికిందికిత్రోయుటసులభముఅటువలెనేగుణములను
లుగలవాడనిపించుకొనుటకష్టముదుర్గుణుండనిపేరుదెచ్చుకొనుటసులభము

అనిచెప్పగాకరటకుండువిని ఓయీ మంచినీతివాక్యములు వివరించితి
వినామనస్సులోనిసంశయముతీరెనుఇప్పుడునీవేమిచేయదలంచితివో అదిచె
ప్పుమనినదమనకుండిట్లనియె

బలంబునుపరాక్రమంబునుధైర్యంబునుగలమనరాజునీళ్ళుత్రాగుటకై
నదికిపోయిరేవులోదిగవెరచియున్నాడు అదినీవెట్లెరింగితివంటివా విను ము
ఏకార్యమైనాభావజ్ఞులైనవారికివిశదమైయుండునుపశువులుఒకరుచెప్పి
నమాటలువిని వారుచెప్పినప్రకారముప్రవర్తించునుగుఱ్ఱములు-ఏనుగలుశిక్ష
లచేతనొకరివశులై వారినితమమీదనెక్కించుకొనితిరుగుచుండునుపండితు
డైనవాడుఒకరుచెప్పనితాత్పర్యమునుఊహించుచుపరులయింగితమునుతె
లుసుకోవడమేబుద్ధిగలుగుటకుఫలముబుద్ధిలేనివారుదైవమునేచింతించుచుతమ
ప్రయత్నమేమిన్ని జరిగించకయుందురుఅటువంటివారుభూమియందుబుట్టి
యేమిప్రయోజనముఈలోకములోపరులయింగితము తెలుసుకోలేనివానిజ
న్మమెందుకుకాబట్టియిప్పుడు నేనురాజుదగ్గిరికిపోయినామీదఅతనిమనస్సు వ
చ్చునట్లుగాకొలిచిఅతనిచేతమన్ననలందెదను,

అనినవిని ఓచెలికాడానీవుమున్నురాజులసేవించినవాడవుకావువారిచిత్త
వృత్తితెలిసియెట్లుమెలగనేర్తువనికరటకుండడిగినదమనకుడుమరలనిట్లనియె

మిక్కిలిసమర్థులైనవారికిఅసాధ్యమొకటికలదా-ఉద్యోగము సేయ
నేర్చినవానికిదూరభూమిగలదా- విద్యలునేర్చినవారికిపరదేశమొకటిగల
దాప్రియవాదులైనవారికిశత్రువులుగలరా-కాబట్టిమనరాజుమన్నించును

సేవకులచేఁ గూడాపోయినన్నా రిగించుకొని అతనిసమీపమువిడువక అనుస
రించియుండెడను రాజులున్ను స్త్రీలున్ను తీగెలున్ను యెల్లప్పుడు తమసమీ
పమువిడువని ఆశ్రితులనుగ్రహింతురుగాని వీరికివిద్యరాదనిన్ని వీనిది మంచికు
లముకాదనిన్ని అనాదరణ చేయరు-తమ్ము సేవింపుచుండినంజాలునని యెంచు
దురు యేభృత్యుడు రాజుయొక్క కోపప్రసాదముల చిహ్నాలెరింగి చరియించు
నో వాడు రాజునయ చేతను ప్రసిద్ధినొందును

అనికరకటకుండు- ఓయీ రాజుదగ్గిరపోయి నీవుయేమి మాట్లాడుచు
న్నావనియడిగెను-అందుకు దమనకుడు చెప్పుచున్నాడు - మంచివర్షముకు
రిసితే విత్తనము వల్లమరియొక విత్తనము యెట్లాపుట్టుచున్నదో - అటువలెనే
బాగా ఉత్తరము చెప్పినట్టయితే దానివల్లమరియొక ఉత్తరముపుట్టుచున్నది నీ
తిమార్గమునందు ప్రవర్తించిన బుద్ధిమంతులు- ఉపాయమును జూపించుటవల్ల
వచ్చే కార్యసిద్ధినిన్ని అపాయమును చూపించుటవల్లవచ్చే పనిచెరుపున్ను
యెదట అగుపడుచున్నట్టు తెలియజేయుచున్నారు నేను సమయమును విచా
రించకుండా చెప్పను-బృహస్పతి అయినప్పటికిన్ని సమయము విచారించక
మాట్లాడెనా అవమానము పొందును-ఏగుణముచేత జీవనము కలుగునో-ఏగు
ణమువల్ల లోకములో సత్పురుషుల చేత స్తోత్రము చేయబడునో అదేమంచిగు
ణము-ఆగుణముచేత నేనరుడు గుణవంతుడనిపించుకొనును - కాబట్టి ఆగుణ
మును కాపాడుకొని వృద్ధిబొందించుకొనవలసినది

అనినకరటకుడు నీకు కార్యంబు సిద్ధించును పొమ్మని దమనకునితో చెప్పె
ను అంతట దమనకుడు పింగళకునికిదగ్గిరికి పోయి వినయభయభక్తులతో దండ
ము పెట్టిన పింగళకుడు అతని మిక్కిలి ఆదరణతో కూర్చుండ నియమించి బహు
దినములకు నిన్ను చూచితినని పలికిన దమనకుండిట్లనియె

దేవరవారికి నావల్లయేమి ప్రయోజనమున్నది అయినా సమయము వ
చ్చినప్పుడు లెస్సగా ఆలోచన చెప్పవలయునని వచ్చినాను మంత్రియైనవాడు
తనరాజుకు సమయము వచ్చినప్పుడు కార్యాకార్యంబులు తెలియజేయుటకై
తన్నుపిలువకున్నా రాజుదగ్గిరికి రావలయును నేనే కాదు యెటువంటి మాన
వుండైనా రాజులకు ఒకానొక వేళ పనికివచ్చును అచేతనములైన గడ్డిపుల్లలు
మొదలైనవి కూడా చెవిదురద పోగొట్టుకోవడము పల్లుకుట్టుకోవడము మొ

దక్షులైనవారికిపనికివచ్చుచుండగానోరుచేతులుమొదలైనఅవయవములుగ
లమానవుండుపనికిరాకపోవునాధైర్యవంతునికి ఒకవేళ ఆపదవచ్చినాఅతఁ
డుమునపట్టిధైర్యమునువదలఁడుదివిటీలుతలకిందుగాబట్టుకొన్నాదానిజ్వా
లలు ఊర్ధ్వముఖములేఅవునుగానియెన్నటికిన్నిఅధోముఖములుగావుమ
రియువిశేషజ్ఞుఁడైనరాజునకు సమస్తమున్ను ముందుగానే అగుపడునుపై
రుపెట్టేవాఁడుసకలమైనవిత్తనములున్ను యుక్తమయినసమయములో చల్లి
మొలకమొలవగానేజాబిఈపైరు యింతమాత్రముపండునని తెలుసుకొన్న
ట్లుబుద్ధిమంతుఁడైన వాఁడు మనుష్యులఆకారముచూచివారిమనోవృత్తిని ని
శ్చయించునురాజైన వాఁడుతనభృత్యుల యోగ్యాయోగ్యతలు తెలియక
వారికి ఉద్యోగములుయిస్తేతలనుధరించే మాణిక్యమును కాళ్లయందున్ను
కాళ్లనుధరించేఅందెతలయందున్ను ధరించినట్లు అపహాస్యానకుఅస్పదము
గును కుందనముతోపొదుగుటకు తగినశ్రేష్ఠరత్నమునుయిత్తడితోపొదిగితేర
త్నమునకుయేమికొదువవచ్చును- తనబంటుకుతగినపనిపెట్టకుంటెఆ తప్పు
రాజుదిగానిబంటుదికాదు- ఇతఁడుబుద్ధిమంతుఁడు - ఇతఁడుతనయందుప్రీతిగ
లవాఁడుఇతఁడుమందుఁడుఅని-రాజు తెలుసుకొనివారివారికితగినపనులయం
దుంచితేవారు అతనివిడువక బహుకాలముకొలుచుచుందురు - గుఱ్ఱమున
కున్ను ఆయుధమునకున్ను - శాస్త్రమునకున్ను వీణకున్నువాక్కుకున్ను
స్త్రీకిన్ని - సేవ్వరియైనపురుషునికిన్ని - ఒకానొకపురుషుని పొందుటచేత
యోగ్యతగలుగుఒకానొక పురుషునిపొందుటచేత అయోగ్యతగలుగును
ఓమహానుభావా-నన్నుజంబుకమాత్రముగానీమనస్సులోనెంచగూడదు వి
ష్ణువువరాహరూపముచేతనున్ను శివుఁడుమృగరూపముచేతనున్నుకుమార
స్వామిఛాగరూపముచేతనున్ను - ఇంద్రాగ్నులు పక్షిరూపముచేతనున్ను
దేవతలచేతపూజింపబడినవారుకారా సేవకుఁడుభక్తిగలవాఁడయి అసమర్థుఁ
డైతేప్రయోజనమేమి సమర్థుఁడయిభక్తిలేనివాఁడైతే ప్రయోజనమేమిస
మర్థుఁడైనభక్తిగలిగిననన్ను మీరుచిన్నచూపుచూడవద్దురాజుఅవమానిం
చుటవలనపరిజనులుబుద్ధిహీనులవుదురువారుబుద్ధిహీనులుకాగానేపెద్దలు
రాజునువిడుతురుపెద్దలురాజునువిడువగానేన్యాయమునశించి అన్యాయ
మువృద్ధిబొందును న్యాయమునశించగానేసకలలోకములున్ను చెడిపోవును
కాబట్టిరాజువివేకముగలవాఁడైయుండెను-

అని దమనకుఁడుపలికినపింగళకుండిట్లనియె-ఓయీనీవుమాప్రధానమం
త్రివుకుండవుగనక చెప్పవలసినమాటలు చెప్పవచ్చునుదానివల్లతప్పేమిలేదు

దమనకుండిట్లనియె - ఓమహానుభావా - భృత్యుండు మీతో గొంచెము విజ్ఞాప
న చేసుకొనుచున్నాడు యేమంటె - మీరు నీళ్లు త్రాగుటకై యమునానదిలోని
గుచున్నప్పుడు - ఆశ్చర్యపడ్డవానివలె నేయిక్కడ నిలిచినదేమని నన్ను పింగళకుండిట్లని
యె వినుము దమనకా సమస్తజంతు సమూహములుగల యీయరణ్యంబు
నాయధీనంబు - ఇన్నిదినంబులు ఈయరణ్యము విడువకుంటిని ఇక నేను వి
డవవలసివచ్చెను యెట్లనిన ప్రళయకాల మేఘము గర్జించునట్టి శబ్దమువలె నొక
శబ్దము నా చెవులకు వినవచ్చెను అందుకు నేను భయపడి శబ్దము విన్నచోట నేని
లిచితిని నేనేమి చెప్పుదును నాకు జూడగా అది గొప్ప జంతువు శబ్దముగా తోచు
చున్నది స్వల్పజంతువునకు అటువంటి శబ్దము కలదా ఇంక నేనేమి చేతును అని
న పింగళకునకు దమనకుండు మ్రొక్కలిడి దేవా శబ్దమాత్రానికి భయపడగూ
డదు బహుజలంబుల చేత కట్ట తెగిపోవును దాచనందున ఆలోచన బైటపడును
కొండెము చేత స్నేహము నశించును మాటల చేత భయపడ్డవాడు చెడిపోవును
కాబట్టి అధైర్యము చేత త్వరపడితే కార్యము చెడిపోవును ధైర్యమును అవలం
బించి నిదానముగా విచారింపవలయును ఇందుకు ఒక పూర్వకథ చెప్పెద విను
ము అని దమనకుండిట్లనియె.

## *పింగళకునకు దమనకుడు చెప్పినకథ*

పూర్వకాలమునందు ఒకనక్క ఒకవనములో సంచరింపుచు ఎక్కడ
ఆహారము దొరకనందున మిక్కిలి ఆకలిచేత కృశించియుండగా దాని అదృష్ట
మువల్ల ఒకదిక్కున కుప్పలుగా కూలియున్న - తేరులును - తొండంబులు - కొమ్ము
లు - తొడలు - తలలు - తెగిపడియున్న యేనుగులును మెడలు కాళ్లు పక్కలు తునక
లైపడియున్న గుఱ్ఱములును ముక్కలు చెక్కలు కాళ్లు చేతులు - మూతులు తెగి
పడిన భటసమూహంబును కలిగి భయంకరమైన ఒక యుద్ధభూమి అగుపడెను
ఆస్థలము నిర్జనముగా నుండుట చేత ఆనక్క అక్కడ ప్రవేశించిన తరువాత వ
కధ్వని విని గుండెలదరి మిక్కిలి భయముతో ఇట్టట్టు కదలలేక కన్నులుమూసు
కొని మూర్ఛనొంది కొంతసేపటికి మూర్ఛ తెలిసి కన్నులు విచ్చి నాలుగుదిక్కు
లచూడగా అసమీపమున వేలంబడియున్న భేరీముఖమున నొక చెట్టుకొమ్మగా
లిచేత తాకుచుండగా నిదానియందు బుట్టిన శబ్దమని తన మనస్సులో పుట్టిన భయ
మంతా విడిచిపెట్టి ఓహో నా అదృష్టము యేమి చెప్పను నాకు మంచి ఆహార
ము దొరికెను అని సంతోషించెను తరువాత ఆ భేరికి పోయి గిన తోలు కొరికి బద్దలు
చేసి దానిలో దూరి బైటికి వచ్చి నేను మునుపే తెలుసుకోలేకపోతిని ఇప్పుడు లో

హముసేస్నేహముతోనుండిరి యిట్లావుండగా కొంతకాలమునకు సింహరాజుత
న పరిజనులను బంధువులను మఱచి సంజీవకుని యందే మిక్కిలి ప్రీతిగలిగి యుం
డెను. అంతట కరటకదమనకోలును మనసులో నిండావిచారమును పొంది నానా
విధములుగా మాటలాడునప్పుడు కరటకుండు దమనకుంజూచి నీవు సంజీవకుని తీ
సుకవచ్చి రాజుదగ్గిర మంత్రిగా నుంచుటవల్లను మనమీద ఆదరణవిడిచెను ఇది నీవ
లన వచ్చిన తప్పుగదా యని పలికిన వానికి దమనకుండిట్లనియె అవును నీవు చెప్పిన
దిసరే యిప్పుడు మనరాజు మునుపటి పరివారము విడిచిపెట్టి సంజీవకుండు చె
ప్పినట్టు వినుటవల్ల సేవకులు ఆహారము గానకనొచ్చి బోయిరి నేనుయింతదూర
ము ఆలోచన సేయక ఇద్దరికి స్నేహము చేసితిని. ఇటువంటి కార్యములకు కర్త
దైవముగాని యితరుల చేత నేమౌను. ఇది నాదోషమని నన్ను నిందించవద్దు స్వ
యంకృతాపరాధము నాకుమాత్రమే కాదు మేషయుద్ధము చేత జంబుకము
ను ఆషాఢభూతి చేత సిద్ధమునియును సాలెవాని భార్యచేత దూతికయును వా
శంబొందిరి. ఈముగ్గురు స్వయంకృతాపరాధము కలవారే అనిపలికిన అది యె
ట్లా నాకు చెప్పుమని కరటకుండడిగెను దమనకుండు చెప్పుచున్నాడు.

—— కరటకునకు దమనకుడు చెప్పిన ఆషాఢభూతి కథ. ——

ఓయి కరటకుడా దేవశర్మయను పేరుగల యొక యోగి కలడు అతడు భూ
సంచారము చేయుచు తానుసంపాదించిన ధనమంతా తనబొంతలోనిమిడ్చిపె
ట్టి అది కప్పుకొని పోవుచుండును ఇట్లావుండగా ఒక మర్జుండు ఈసంగతి తెలు
సుకొని ఆధనము దొంగిలించుటకు శిష్యత్వమును వహించి ఆషాఢభూతియను
పేరుపెట్టుకొని అత్యంతవినయభయభక్తులను అతనికి చూపి నమ్మించి పనులు
చేయుచు ఒకనాడుదయకాలమున ఆయోగితో కూడా దారిన నడుచునప్పుడు
ఒకపూరిపుడక చేతపట్టుకొని అతనికి చూపి అయ్యా మనము ఈరాత్రి పరు
న్నయింటివారిది ఈపూరిపుడక నాబట్టనంటివచ్చెను పరులసొమ్ము అపహ
రించుట మంచిది కాదు నాకు సెలవిచ్చితే నేను తిరుగాపోయి యిది వారికిచ్చి
వచ్చెదనని చెప్పి అతనివద్ద సెలవుతీసుకొని వెనకకుపోయి దారిలో కొంతసే
పువుండి పిమ్మట అతనిదగ్గిరకి వచ్చెను. అది యోగిచూచి వీడు పరద్రవ్యాపే
క్ష లేనివాడని దృఢముగా మనస్సులో నెంచి తనబొంతతాను మోయలేనని
ఆషాఢభూతిదగ్గిరనిచ్చెను పిమ్మట ఒకనాడు అరణ్యమునం బోవుచుండగా
ఆయోగి ఒకచెరువుచూచి అచ్చటికిపోయి ఆచమనము చేయుచుండెను ఆస
మీపములో రెండుపొట్టేళ్లు అత్యుగ్రముగా ఒండొంటిం దాకి తలలుపగలపో

గుచుండెనప్పుడు వాటితలలు దాకి పగిలి కారిన రక్తముపడియుగిరికరుడుగట్టి నుఒకనక్క అది మాంసఖండమని తలచి దగ్గిరికి వచ్చి ఇది మేష యుద్ధమధ్యమని తలంపక జిహ్వాచాపల్యముచేత అది భక్షింపుచుండగా మునుపుడీకొని వెనక వెనకకు పోయితిరుగా ఢీకొనే పొట్టేళ్ల నడుమ చిక్కి ఆనక్క ప్రాణములు విడిచెను ఆయోగి అది చూచి విచారపడి మేషయుద్ధముచేత జంబుకము హనించెనని పలికి ఆషాఢభూతిని పిలిచిన వాడు పలుకనందున ధనము పెట్టి కుట్టిన బొంత వాడు అపహరించుకొని పోయినాడని ఊహించి ఆషాఢభూతిచేత నేను మోసపోతిని అని మిక్కిలి విచారముతో సూర్యాస్తమయసమయమున ఆసమీపమునందుండే పట్టణములో నొకసాలెవాని యింటికి పోయి ఆరాత్రి అక్కడ శయనించి సొమ్ము పోయినందుచేత కంటికి నిద్రపట్టక డోలాయమాన మానసుండై వేగించుచుండెను.

ఆసాలెవాని భార్య పరపురుషులతో గూడి సంచరించుట దానిచే మగడు దానినొకకంట గనిపెట్టియుండెను. ఆరాత్రి ఒక దూతిక దానిం బిలువవచ్చెను అది తన విభుడు ఇంట్లో లేనందున ఆదూతికతో కూడా పరపురుషుని యింటికి బోవుచుండగా సాలెవాడు యెదురుగా వచ్చెను. అప్పుడు ఆ స్త్రీ తన పెనిమిటిని చూచి చూడని దానివలె దూతికను త్రోలగనంపి పెనిమిటికంటె ముందుగానే యిల్లుచేరి అతిభక్తితో సతని కాళ్లు కడిగి ఉపచారము సేయవచ్చెను వాడు దాని వంచన యెరిగి ఒళ్లంతా చెడగొట్టి గుంజకు విరిచి కట్టి ఓదుష్టురాలా నీపాట్లు తెల్లవారిన వెనక చూడుమని నిద్రపోవుచుండెను తర్వాత దూతిక వచ్చి ఓసి బెదిరిన లేడివంటి కన్నులు గలదానా నీపెనిమిటి చచ్చినవాని వలె నిద్దురపోవుచున్నాడు ఇతనికి తెలియకుండా నీవు సుఖించుటకు సొమ్ము నీవు వచ్చెదా కాని నన్ను కట్టిన త్రాళ్లు కట్టు నేను కట్టుకొనియుండెదను నీవు మన్మథుని వంటి యుపపతితో రమించి నామీద ప్రీతియుంచుము నీమగడు మేల్కొనకమునుపే అక్కడికి పోయి శీఘ్రముగా రమ్ము వీనికి యపము డై నాజపుచును అని దానికట్లు విప్పి తన్ను కట్టించుకొని ఆ స్త్రీని అంపించెను అది అర్ధరాత్రివేళ కటిక చీకటిలో ఉన్న ధుంధుసహాయముగా మిండగాని యింటికి పోయి అతనితో గూడియుండెను అంతట ఆసాలెవాడు మేల్కొని ఆంధకారములో తన భార్యరూపము తెలియక ఓసి గులామా నన్నెరుగకుండా అప్పుడెక్కడికి పోతివి నేను కులములో వన్నెవాసికలవాడను నాకు అపకీర్తి తెచ్చితివి నీబవిసి యార్చి కూటికి గుడ్డకు దూరముగా నిన్ను తొత్తువలె చేసెదను అని కోపముతో చెప్పి ఓబుద్ధిహీనురాలా నిన్ను విడువలేక నీమీద దయచేత జెప్పుచున్నాను విను ఇక మీద నొక్క

తెకిన్ని పోనివిపట్టు పెట్టుకుంటివా నీకట్లు విడుచుచున్నానుఇది నీకుసమ్మత
మాఅనిపలికెనుఅప్పుడా దూతికవిని తానుమాట్లాడితేతనమాటఖ్యాలివా
డుకనిపెట్టుననియేమిన్ని చెప్పవేరచిఊరికెవుండెనుఅంతటవాడుకాలాగ్ని
వలెమండిపడుచురౌద్రాకారుండై ఈమురాత్మ రాలు నాక్షప్రహారణము సే
యమంటే మాట్లాడకుండా వున్నదిఇటువంటి దుర్మార్గపుపనులుఇక మీద
కూడా చెయ్యవలెననితలంపుకద్దే మోఆ అత్యంతకోపముతో మంచిపదును
గలకత్తితీసుకొని దూతికముక్కుకోసిమరల పడుకొనినిద్రపోయెనుఆసమయ
మునవానిభార్య ఉపపతిని సంతోషపెట్టి మెల్లమెల్లగా నింటికివచ్చి దూతిక
నుచ్చూచి ఓప్రియసఖీ నాపెనిమిటి మేల్కొనినన్నేమనునోఅని నేనుమిక్కి
లిదిగులుపడియున్నానుఅతండిదివరకు మేల్కొనలేదు గదాఅని ఆదరణతో
అడిగెనుఅప్పుడాదూతికకన్నీరొలకనిట్లనియె-నీవుపోగానే నీపెనిమిటినిద్ర
లేచినన్నునీవనిఎంచినాముక్కుకోసెనుఇకనాకెక్కడిసమసారమమ్మానా
కట్లువిడువుముపోయెదననిజరిగినవృత్తాంతమంతా మెల్లమెల్లగా చెప్పెనుఅం
దుకుఆస్త్రీయుండాదుఃఖపడిదానికట్లువిడిచి మునుపటివలె తానుకట్టించుకొ
నియుండుసమయంబునదాని పెనిమిటితిరుగా ఓదుష్టురాలా ఇంకనేమిచే
సెదవనినఅదిమగనితోనిట్లనియె-నన్నునిష్కారణముగా నాసరివారిలోతల
వంపులగునట్లునాముక్కుకోసితివినిజముగానీవువిన్నదికన్నదియేమైనా
కద్దానన్నోల్లకయిట్లాచేసితివి స్త్రీలందరుతిరుణాళ్లకుపోవుచుండగా నేను
న్నుపోవుచుంటినిఅప్పుడునీవు నాకెదురుగావచ్చినందున పోకనిలిచితినినా
వల్లనేరమేమిన్ని లేదుఇదినీవువిచారించకనన్నిట్లు చేసితివియయిడయినాత
గనిదండన చేయదు నేనుయెన్నడున్ను యొకరిడికిన్నిపోయినదానను గానుత
లవాకిలియెటువంటిదోయెరగనుకలలోనైనా పరపురుషునిదలంచినదానను
గాను ఇటువంటి మహాపతివ్రతనైన నన్ను విరూపినిగా చేయుటకుయెవరిచే
తనవునునీవుబుద్ధిహీనుడవు పాపాత్ముడవుఅనిపలికి దేవతలను వేడుకొని నే
నుపరపురుషునిమీదమనసు లేనిదాననైతే నానాముక్కుమును పటివలె నేవ
చ్చునట్లు చేయవలెనని ప్రార్థింపుచుండికొంత సేపు తాళిఇదుగో నాముక్కు
నాకుయెప్ప టివలె వచ్చినదిచూడుమని చెప్పెనుఅప్పుడుదాని పెనిమిటిఆ
మాటలువినిఆశ్చర్యపడి లేచిఅతిశీఘ్రముగాదీపముతీసుకొనిదగ్గిరకువచ్చిదా
నిముక్కుచూచినతక్షణమేదానికాళ్లమీదబడితనతప్పుక్షమించుమనిదానిక
ట్లువిడిచిప్రియవచనములు చెప్పెను- ఇదిఅంతాఆయోగి చూచుచుండెను
ఇంతలో ప్రభాతసమయమాయెను.

అంతనాదూతిక కోసిన ముక్కు చేతబట్టుకొని తన యింటికిపోయి మంచ
ముమీద కూర్చుండి తనమగనితో నేనా బొంకుదునా యేమి సేతునని చింతింపు
చున్న సమయంబున దాని పెనిమిటియైన క్షౌరకుడు మేల్కొని ముఖప్రక్షాళన
ము చేసుకొని తన భార్యను పిలిచి రాజుగారు నన్ను పిలువనంపినారు నేను శీఘ్ర
ముగా పనిచేయబోవలెను కత్తుల పొది తీసుకొని రమ్మనెను అది ఒక కత్తి అతని చేతి
కి తెచ్చియిచ్చెను వాడు కత్తి పుచ్చుకొని బహుకోపముతో భార్యను చురచు
ర జూచి ఓ తొత్తా నేను కత్తుల పొది తెమ్మంటే నీవు ఒక కత్తి నాకెందుకి
చ్చితివి యేమి పరాకున నున్నావు అని బహువడిగా ఆ కత్తి దానిమీద వి
సిరి వేసెను.

అపుడా దూతిక తనమగడు విసరివేసిన కత్తి దాకి తనముక్కు తెగిపోయెన
ని మొఱలు పెట్టుచు కొంగుతో ముక్కు మూసుకొని వీధిలో నుండే వారందరు
తన వెంటవచ్చుచుండగా రాజు దగ్గిరకి పోయి రోదనము చేసెను రాజు దానిం
జూచి యేమి నిమిత్తము రోదనము చేయుచున్నావని యడుగగా అది చె
ప్పుచున్నది స్వామీ మహాప్రభో నాయందు తప్పు కొంచమైన లేదు ఎల్లప్పుడు
న్నా పెనిమిటిని నా పాలిటి దైవముగా దలంచుచుంటిని నన్ను నావగవా
ల్లకని షా కారణముగా పగబట్టి కొట్టించుచుండె యిప్పుడు నాముక్కు కోసెను
ఈదురవస్థ నేమి చెప్పుదును ఇక నాకు నీవే దిక్కనుచు నీవు ఉభయుల జూచి
నా మొరయాలకించి నన్ను రక్షింపుము అని రాజునకు విజ్ఞాపనము పలికిన
రాజు క్షౌరకుని పిలువనంపించి ఓరి దురాత్మా బహుపాలి నీభార్య నేల కొట్టి వి
రూపిం జేసితివనియడిగెను - వాడు భయపడి రాజునెదుట నేమియును బలుక
నేరనూరకుండెను - పిమ్మట రాజు తన భృత్యులం జూచి మీరీదుర్మార్గుని కంబ
ట్టికట్టి తీసికొనిపోయి నగరంబునకు వెలుపట కొఱ్ఱ వేసి రండని ఆజ్ఞ చేసెను అం
తట దేవశర్మయను పేరుగల ఆ యోగి యీవృత్తాంతమంతా యెరుగును గనుక
నక ఆరాజు సన్నిధానమునకు వచ్చి నిలిచి ఆశీర్వదించి ఓ రాజా మేషయుద్ధము
చేత నక్కయు - ఆషాఢభూతి చేత నేనును - సాలెవాని భార్య చేత దూతి
కయును - హానిం జెందిరి స్వయంకృత దోషంబున నేకదా యని పూర్వవృ
త్తాంతంబంతయు నెఱింగించిన రాజు తత్క్షణంబున మంగలవానిం బిలుపించి నీ
వలన తప్పేమియు లేదు పొమ్మని సెలవిచ్చి వాని భార్యను కొర్ర వేయ నాజ్ఞాపిం
చి సాలెవాని భార్యను విరూపిణిం జేయించి దేవశర్మను పూజించి - సుఖంబున
నుండెను, అని పలికిన కరటకుండు దమనకునిం జూచి నీవింక జేయందలంచిన కా
ర్యంబేమి యని యడిగిన దమనకుండిట్లనియె చెడిపోయిన కార్యము ను చక్కబె
ట్టుటకున్ను ఇకమీద కాబొయ్యే ప్రయోజనమును సంగ్రహించుటకున్ను అనర్థ

ములను పోగొట్టుటకున్న తగిన ఆలోచన యేదిగలదో అదే శ్రేష్ఠమైన ఆలోచన కావున మనము చక్కగా ఆలోచన చేసి సంజీవక పింగళకులకు భేదము పుట్టించుటకై యొక యుపాయము సేయక తాళుకొని యుండి యేకాంతవాసము పింగళకుని దగ్గిరికి జేరవచ్చునా అనిన విని కరటకుండిది యెట్లు సాధ్యంబగునని న దమనకుండు మరల నిట్లు యెడఁబాయము చేత నేని సాధింపశక్యమో అది పరాక్రమము చేత సాధింపశక్యముగాదు రాజుగారి బంగారపు సొమ్మెత్తికొని కాకి యుపాయము చేత దనకు శత్రువగు సర్పమును జంపించెను ఉపాయము వలన సాధ్యము గాని కార్యము గలదే అనిన కరటకుండా కథ వినవలతును జెప్పుమనెను దమనకుండిట్లని చెప్ప దొడంగెను.

## దమనకుడు కరటకునకు చెప్పిన కాకి కథ.

ఒక మఱ్ఱిచెట్టు కొమ్మమీద నొక కాకి గూడు కట్టుకొని తన భార్యతో గూడా కాపురముండెను ఆ చెట్టు తొఱ్ఱలో నొక కృష్ణసర్పముండి ఆ కాకి పెట్టిన గుడ్లన్ని వాలాయముగా భక్షింపుచుండెను అందుకు ఆ కాకి నిండా వ్యసనపడి కృష్ణసర్పమునకు పరచి తాను చేయదగినది లేక తిరుగా తన భార్యకు ప్రసవకాలము రాగానే తనకు ప్రియమిత్రుడైన ఒక నక్క దగ్గిరికి పోయి తనకు కృష్ణసర్పము చేయుచున్న అపకారమును చెప్పి యేమి సేయుదు ననిన ఆ నక్క యిట్లనియె - మును ఒక కొలంకులో నున్న మత్స్యముల నెల్ల కపటముతో మింగి విఱ్ఱవీగుచున్న వొక కొంగను యెండ్రకాయ వుపాయము చేత చంపెను - అట్లు నీవును పగదీర్చుకొనుము అనిన ఆ కథ వినవలతును జెప్పుమని కాకి అడిగిన నక్క యిట్లనియె*

## కాకికి నక్క చెప్పిన యెండ్రకాయ కథ.

ఒక గొప్ప కొలని దగ్గిరికి నొక ముసలి కొంగ మెడ యెత్తుకొని కన్నులు మూసుకొని తన్ను జూచు వారికి బహు కఠినమైన వ్రతంబాచరించుచున్న విధంబు దోచునట్లుగా గూర్చుండి ఆహారం బేమియుం గొనక యుండిన నొక యెండ్రకాయ చూచి ఆశ్చర్యపడి కొంగ దగ్గిరికి వచ్చి తియ్యని మాటలతో మెల్లగా నిట్లనియె - ఓ బకశ్రేష్ఠమా నీవు మిక్కిలి ఆకలి చేత నొచ్చియుండిన్ని చేపలు దగ్గిరికి వచ్చినా భక్షింపకుండుట యత్యద్భుతంబుగా నున్నది ఇది యేమి చెప్పుమని యెండ్రకాయ అడిగిన కొంగ చెప్పుచున్నది ఓ కర్కటరాజా మును నేనీ కొలంకులకైనా పోయి అక్కడనుండే చేపలను భక్షించి దేహము పెంచుకొనుచుంటిని మొన్న పిడుగు వంటి మాట వింటిని అది మొదలు కడుపు నిండించుకోవడము విడిచి చింతాసముద్రములో మునిగి యున్నాను యేమి చెప్పుదును అనిన కర్కటకము మహావిచారముతో కొంగను జూచి నీ వేమి వింటివని యడిగెను ఆ కొంగ కన్నుల నీళ్లు గ్రుక్కుకొ

సుచుమున్నఁ గొందఱు బెస్తలువచ్చి యీనీళ్లలోతుచూచిపోయిరి-ఇంకనేనిమి
దిదినములకునిండానీరుఇంకిపోవుచున్నది తర్వాత వలలుడొతలుగాలములు
మొదలయినసాధనములుతీసుకొని ఆ బెస్తలువత్తురని వింటిని అని చెప్పఁగా అక్క
డనున్న చేపలన్నియు యీమాటవిని ఓబకశ్రేష్ఠమా నీవుమమ్మందరినుద్ధరించు
టకైపుట్టినావు మాకు నేడీయాపద నీవు దొలఁగించవలెనని మహాదీనత్వముతో
వేడుకొనెను అప్పుడుకొంగకొంత సేపుమనస్సులో చింతించి ఇకమీద నేనుచే
యవలసిన కార్యమేమనియడిగెను ఎన్నటికిన్ని యింకిపోని నీళ్లుగలిగిన యుం
కొకకొలనిలో మమ్ము కొంచపోయి పెట్టితే చాలును ఈసమయమున నీవుతప్ప
మాకు వేఱెరక్షకుఁడు లేడని మత్స్యములుపలికెను. అప్పుడుకొంగతనమనస్సు
లోనుప్పొంగి-నేనుమిమ్మునవక్కసారితీసుకొపోలేనుగాని క్రమక్రమముగా
ఒక్కొక్కరిని నాముక్కున కఱచుకొనిపోయి మీకనుకూలమయినతావున
సురక్షితముగానుంచగలనని దయారసము ఒలుకునట్లుగాబలికెను- అందుకు
చేపలుసమ్మతించెను-అటుపిమ్మటకొంగ ప్రొక్కొక్క చేపనుతనముక్కున కఱ
చుకొనిపోయి - ఒకవిశాలమైన బండమీదను దానిందిని తిరుగావచ్చి మఱి
యొకచేపనుతీసుకొనిపోయి కడుపునిండించుకొనుచు కొన్ని దినములలో క్ర
మక్రమముగా చేపలన్నింటిని మనసుదీర భక్షించి-తనవిదీరక కొలనిలో చేపల
నువెతుకుచుండెను - అప్పుడుకర్కాటకముకొంగనుజూచి - స్నేహితుఁడా-
నేను బహుదినముల నుంచి ఈగుంటలో మీనములతో కూడా పెరిగి యిదివర
కుసంతోషముగానుంటిని యిప్పుడు నేనొంటిగా విడిచితిని ఇంకనన్ను తీసుకో
నిపోరాదా అనిపలికెను ఆమాటకొంగవిని నేనిదివఱకెన్నఁడున్ను కర్కాటక
మాంసము రుచిమెరుగను నేడు దైవవశముచేత నాకదిలభించెనని మనస్సులో
పొంగి త్వరగా దాన్ని తనముక్కున కఱచిపట్టి మునుపు తాను మత్స్యములను
భక్షించిన చోటికిపోయి రాతిమీద వ్రాలగా యెండ్రకాయ చేపనంజుడువా
సనపట్టి-ఈదురాత్ముఁడు కపటోపాయముచేత చేపలనెల్లనిక్కడనే చంపిభక్షిం
చెనని యెంచి తనమనస్సులో నిట్లని వితర్కించెను సాహసము లేనివాని బ్రతు
కెందుకు శూరుఁడైనవాఁడు భుజబలముచేత విజృంభించి శత్రుసమూహములను
చంపనేచంపును లేకపోతే తానుచావనైనా జచ్చును పిరికివాండ్లు కొంచము సే
పుయుద్ధభూమియందు నిలిచి జయముగొనలేక పారిపోదురు మృత్యువు సమీ
పించినపుడు శరీరము దాచుకొనగలరా ఆదిహీనులైన వారెఱుంగక యిహపరసు
ఖములు చెరుపుకొందురు బుద్ధిమంతులైనవారు ఆసమయంబునందు తొలగిపో
కనిలిచి యిహపరసుఖములను భవింతురు ఈలోకములో వైరమెవ్వరికిన్ని కొర

గాదు ఆటువంటి వైరము బలవంతముగా సంభవించెనా తనకుదగిన సహాయ
ముము గూర్చుకొని పగవారిని సాధింపవలెను తానుబలమును గూర్చుకొనక
మును పుపగవాడు సమయము చూచి మొత్తివచ్చినట్లాయెనా తాను మొగము
దప్పించక పగవానిపైకి పోయి వానినైనా, చంపవలెను తానైనా చావవలె
నుపారిపోయినట్టయితే కాలకాలము బ్రతుకవచ్చునా కొన్నాళ్లకైనా చావుసి
ద్ధమే కదా అవిప్రాజ్ఞుడైనవాడు తెగించును కాబట్టి నాకు సాహసము సేయుట
కిదిసమయమని యోచించి ఎండ్రకాయ కొంగను తనగిట్టలచేత నొకతూణమ్ము
లోనదిమిపట్టుకొని మెడకొరికి చంపి స్వేచ్ఛగాపోయెను. ❀❀❀ ఈప్రకా
రమునీవున్ను ఒకయుపాయము చేతికి నీ శత్రువైన కృష్ణసర్పమ్మును జయించు
ముఅని చెప్పగా కాకి నక్కచేత సెలవుదీసుకొని తానున్న మఱ్ఱిచెట్టు దగ్గిరికి వ
చ్చెను. ఆమరునాడు ఆపట్టణ మేలుచున్న రాజుభార్యలందరున్ను ఉద్యా
నవనమునకువచ్చి మల్లెలు మొల్లలు సంపెంగలు జాజులు బొండుమల్లెలు క
స్తూరిపట్టెలు చేమంతులు చెంగల్వలు మొదలుగాగల నానావిధములైన పూవు
లు కోసుకొని అలసి సొలసి జలక్రీడలాడవలెనని తలచి కొలనిలో దిగునప్పుడు త
మ సొమ్ములు కొన్ని దీసి ఆచెట్టు కొమ్మలకు తగిలించిరి అప్పుడా కాకి సమయము
చూచుకొని వచ్చి స్త్రీలు చూచుచుండగా వాటిలో నవరత్నఖచితమైన బం
గారు సొమ్మొక్కటి ముక్కున కరచుకొని దూరముగా పోక దాపుగానే ఒక
చెట్టుకొమ్మమీద కూర్చుండెను ఆసమాచారము పరిచారకులు శీఘ్రముగా రా
జుతో చెప్పిరి రాజు తన భృత్యులను జూచి మీరు త్వరగా పోయి కాకి యెత్తుక పో
యిన సొమ్ము తీసుకొని రండని యాజ్ఞాపించెను అంతట రాజభటులు దగ్గిరికి రా
గానే కాకి మెల్ల మెల్లగా పోయి కృష్ణసర్పమున్న పుట్టలో ఆసొమ్ము పడవేసెను
అది చూచి వారు పారలతో గడ్డపారలతో గుద్దండ్లతో ఆపుట్టత్రవ్వగా నందు
లో చుట్టచుట్టుకొని నిద్రించుచున్న కృష్ణసర్పము లేచి బుసగొట్టుచు కోపాగ్ని
తో మండిపడి కొందరిని కరచి కొందరిని దరమెను కొందరు ధైర్యశాలులు దుడ్డుక
ఱ్ఱలతో నాపామును కొట్టిచంపి ఆసొమ్ము తీసుకొనిపోయి రాజునకు సమర్పించిరి

కావున ఉపాయంబున సాధింపరాని కార్యంబులుగలవే బలములేనివాడై
నా బుద్ధిమంతుడైతే వాడే బలాధికుడు బలముగలిగియున్నా బుద్ధిహీనుడైతే
వాని బలమే నిష్ఫలము అల్పజంతువైన కుందేలు మహత్తైన బలముగలిగిన సిం
హమును నేర్పుతో చంపెను కుందేలు బలము చూచితివా అనిన కరటకుండా క
థ నేను వినవలెను జెప్పుమనిన దమనకుండు చెప్పుచున్నాడు.

### ❀ కరటకునకు దమనకుడు చెప్పిన కుందేటి కథ. ❀

ఒకవనములోమదోత్కటమను పేరుగలయొకసింహము చేరిఅచ్చటిసమస్తమైనజంతువులనుబట్టుకొనిచంపిభక్షింపుచుండెను ఆవనములోనుండెడు పెద్దపులులు చిరతపులులు పందులు కారెనుపోతులు దుప్పులు లేళ్లునక్కలుకుందేళ్లుమొదలుగాగల నానావిధములైనజంతువులన్నియు దానికి భయపడిగుంపుగూడి సింహముదగ్గిరకివచ్చి బహుదీనత్వముతో కాళ్లమీదపడిఓమృగేంద్రుడా యీయడవిలో బహుదినములనుండి వాసము చేయుచున్నమేమందరము మీకొకవిన్నపంబు చేసుకొనవచ్చితిమి ఏమనగా మీరుకోపము చేతమృగములనన్నిటి నొక్కసారిగాజంపవద్దు మేమువంతుప్రకారముగామీరున్నచోటికిమాలోనొక్కొక్కమృగమువచ్చి మీయాకలిదీర్చునట్లుగా మేము యోచన జేసుకొనియున్నాము ఇందుకు మీరుసమ్మతించిమాభయముదీర్చవలెను అనిసింహముతో జెప్పగాసింహముసమ్మతించిమీకభయమిచ్చితిని - సుఖంబుగానుండుమనిమృగములనంపించెను తర్వాతమృగములుతమతమవరుసప్రకారముగాసూర్యోదయకాలమునకుదిన మొకటివంతునసింహముదగ్గిరికిపోవుచుండెను ఆసింహముదానిభుజించిఆకలిదీర్చుకొనుచుబహుకాలముగడిపెను అంతటనొకనాడు నేడుకుందేటికివరసవచ్చెనని మృగములు చెప్పెను ఆమాటవినగా నేకుందేలుప్రాణములుకొట్టుకాడగామూర్ఛపోయికొంత సేపటికిమూర్ఛ దెలిపి కన్నులుదెరచి దుఃఖించితలయూచిచింతాసముద్రములోమునిగిముహూర్తమాత్రమునకు తెలివితెచ్చుకొని మనసులోనుండేదిగులు విడిచిసాహసముతో తనమనంబులోనిట్లనివితర్కించెను క్రూరములైనమృగములనునిగ్రహించుటయందుమహాబలముగలిగినసింహమునునాబుద్ధిచాతుర్యముచేతనశింపచేతును బుద్ధికినశక్యమైనపనియీభూమిలోలేదు కాబట్టి నేనేప్రకారముగానైనాజయమును బొందుదునని కొంత సేపుయోచించికుందేలుపైనమై సింహముదగ్గిరికిపోయెను- ఇంతలోసింహము ఆకలిగొనికోపముచేతమధ్యాహ్నకాలమందలిసూర్యునివలెమండిపడుచుపెదవులుగొరుకుకొని యీవనములోనుండేమృగములుదినమును నాకునంపించుమృగమును నేడంపించకపోవుట యెందువల్లను నేనిప్పుడుపోయిమృగములనన్నింటినిబట్టిచంపిభక్షించెదనుఇట్లుచేయకపోతే వాటిగర్వమణగదుఅనిగుహబైలువెళ్లెనుఆసమయములోధైర్యశాలియగుకుందేలుభయపడ్డదానివలెనడుగులుతొట్రుపడగానంతటదూరంబుననుండి నేలంబడిమొక్కలుపెట్టుచులేచుచుపెదవులుదడుపుకొనుచుమెల్ల మెల్లగాసింహమువద్దచేరెనుఅప్పుడాసింహముకుందేలునుచూచికను లనిప్పులాలుకకోరిదురాత్మా

మాకు వేళదప్పిన యాహారంబు హితంబుగానుండదని నీకు తెలియదా అపరా
హ్ణవేళదాకా నీవిక్కడికెందుకు గాకపోతివి అడవిలోనున్న జంతుసమూహ
మునకేమైనా విపరీత బుద్ధులు పుట్టెనో అని కోపముగా మాట్లాడుచున్న సిం
హమునకు కుందేలు సాష్టాంగదండము పెట్టి యిట్లనియె ఓ మృగరాజా కోపము
సేయక చిత్తగింపుము నేడు నావల్లనొక యపరాధంబును లేదు సూర్యోదయ
కాలమునందు లేచి నేను తమదగ్గిరికి వచ్చుచుండగా నన్నొక సింహము నడ్డ
గించెను. నేను నాకు ప్రభువగు సింహరాజు దగ్గిరికి నేను పోవలెను నన్ను పోనిమ్మ
ని చెప్పితిని యీ మాట చెప్పగానే అతడు బహుకోపముతో ఈ వనంబులోను
న్న జంతుసమూహమునకెల్ల ప్రభువును నేనుగాని వేరే ఒకడు కలడా అని
శానా సేపు నన్ను చిక్కుల పెట్టి నాకంటె నధికుడెవ్వడు నాకు నతని దెచ్చి చూపు
నిన్ను విడిచి పెట్టుచున్నాను నీవు శీఘ్రముగా బోయి యతనిం బిలుచుకురమ్మని
నా చేత బాసలు చేయించుకొని యిప్పుడు నన్ను విడిచెను యీ వర్తమానము దేవ
రవారితో మనవి చేతామని బహుత్వరగా సన్నిధానమునకు వచ్చితిని ఇక మీరన
తడు మీదగ్గిరకి వచ్చే మృగములను విడువడు నేడు నేను పడ్డశ్రమ యేమి చెప్పుదు
ను అని చెప్పగా సింహము మిక్కిలి రౌద్రాకారముతో కుందేలును జూచి ఆ సిం
హమును నాకు చూపించుము నేను స్వామీ నేనతని చూపించెదను మీరిప్పుడే
బైలువెళ్లవలెనని కుందేలు చెప్పెను ఓరి నీవు శీఘ్రముగా నాకు ముందర నడిచి
దోవ చూపుమని సింహము గర్జించుచు కదలెను కుందేలున్ను అతిత్వరితముగా
సింహమునకు ముందుగా పరుగెత్తి సింహమును బహుదూరము తీసుకొనిపోయి
మునుపు తాను చూచి వచ్చిన అగాధమైన బావిదగ్గిర నిలుచుండి ఓ మృగరాజా
మహాప్రభో శత్రుసంహారకా ఇదుగో నీశత్రువైన సింహము దగ్గిరికి వచ్చి చూ
డు నీకతడు అగపడుచున్నాడని తొంగిచూపెను. అప్పుడా సింహము బావినీళ్ల
లో ప్రతిఫలించిన దేహము చూచి అది మఱియొక సింహమని యెంచి బావి
లో కుమికి తత్క్షణమే ప్రాణము విడిచెను. కాబట్టి యెంత బలవంతునినైనా బుద్ధి
బలము చేత గెలువవచ్చును. అనిన విని కరటకుండు నీకుం గార్యసిద్ధియగునని నిశ్చ
యంబుగా బొమ్మని చెప్పెను అంతట దమనకుడు పింగళకుని దగ్గిరికిం బోయి న
మస్కరించి నేను దేవరవారికి నత్యంతాపరాధంబు చేసితిని. ఈ యపరాధంబు
సహింపవలయును పదవిగలిగిన మంత్రి రాజు ఎదుట నెట్లు పలికినా చెల్లును పద
విలేనివాడు పదివేలు చెప్పినా ప్రజలకుగాని రాజునకుగాని సరిపడియుండదు
అని పలికెను పింగళకుండా మాట విని యేమో దమనకా నీవేమి చెప్పవలయునది వే
రవక చెప్పుము నీకంటెను నాకు హితుండు గలడా అని బహు ప్రీతిగా మాట్లాడె

నప్పుడు దమనకుండు చేతులు జోడించుకొని వినయభయభక్తులతో నిలిచి సిం
హముతో జెప్పుచున్నాడు ఈసంజీవకుడు నామొద్దమీమీద నేరంబులెన్నుచు
నెల్లప్పుడు నిన్నెగతాళి సేయుచుండును పకార్యమందును నిన్ను లక్ష్యము సే
యడు అదియునుంగాక కొంచెము దినములలో నీమాట కెదిరించి నిన్ను మూల
దోసి నీరాజ్యమును తానపహరించవలెనని మనస్సులో నెంచియున్నాడు ఈ
సంగతి నేనెరిగి నీకు దెలియజేయవచ్చితిని అని పలికిన భయంబును విస్మయంబు
నుమనంబున బెనంగొన నేమియుం బలుకకున్న సింహంబుతో మరలదమన
కుండిట్లనియె.

ఓ రాజా వీడొక దుష్టమంత్రులలో మించినవాడు యీలోకములో రాజ్య
లక్ష్మి అత్యుచ్ఛ్రయమును పొందిన మంత్రిమీద నొకపాదంబును రాజుపై నొక
పాదంబును పెట్టినిలిచి ఆలక్ష్మి స్త్రీస్వభావముచేత గొన్ని దినములకు వారిలో
నొకరిని విడిచిపెట్టును రాజు గొప్పమంత్రిని నిలిపితే రాజ్యభారమంతా అతడు
నిర్వహించి విషయాసక్తుడౌను ఆవిషయాసక్తిచేత మోహముపించును ఆ
మోహముచేత గర్వముగలుగును గర్వముచేత కన్నులు గానక కానిపనులు చే
సి రాజు నెత్తివేసి దండుతనవశముగా జేసుకొని రాజు పక్షమందుండే వారికి అ
న్నవస్త్రములు ఇవ్వక ఉపాయముచేత రాజుంజంపి రాజ్యమంతా తనవశము
జేసుకొనును ఉపకారమునకు ప్రత్యుపకారము చేసేవాడు ఈలోకములో అ
రుదు అందరికిన్ని తమ కార్యములు అయినతర్వాత బుద్ధి వేరే పోతున్నది అనేకభా
గ్యమిచ్చి ప్రీతిగా తన్ను మన్నించిన రాజును విచారించక పరరాజుల దగ్గిర లంచ
ములకు నాసపడి దుష్టుడైన మంత్రి యీలోకమునందు రాజును జెరిచి పరలోక
మునందు తాను జెడును విషము కలిసిన అన్నమున్ను కదులుచున్న పల్లును
న్నూ దుష్టుడైన మంత్రిని న్నూ బొత్తిగా యెత్తివెయ్యడము సుఖకరము సంజీవకుం
డు సకలకార్యములయందున్ను స్వేచ్ఛగా ప్రవర్తిస్తున్నాడు అది మీ చిత్తానకు
తెలిసే వున్నది సంపత్తును కోరని వాడు లోకములో లేడు ఆకోరిక కొనసాగిం
చుకొనుటకు అశక్తుడైనవాడు రాజును గొలుచును సేవకులైన వారు తాము
భాగ్యవంతులైయుంటే రాజుల నేల సేవింతురు జరుగుబాటు లేక నేకదా చె
ప్పినపని చేయడము ఇటువంటి సేవకులను మఱియొకరిని రాజుదగ్గిరికి చేరని
య్యక తానే సర్వాధికారియై యున్నాడు ఇదిఅంతా చూడగా దేవరవారికే
మో మోసము శీఘ్రముగా చేసునని తోస్తున్నది తమరిప్పుడే మరి యుండరా
దు నామాట నమ్మదగితే నమ్మండి లేకుంటే పరస్పరముగా విచారించండి- అ
ని చెప్పగా విని పింగళకుండు దమనకునికి జూచి ఓయీ యీదేహము సకలదో

శములతోగూడుకొన్నదైనా యిది యొంటుక విడిచేవాడెక్కలరా అటువలె
తనమిత్రుడొకవేళ నపకారము చేసినాగాని విడిచిపెట్టటమంచిదికాదు నన
మనమ్మికయిచ్చి అధికారములో ప్రవేశపెట్టి ఒకమాటవల్ల సాహసము చేయ
రాదు వానివల్లను నేరమున్నట్టయితే వాడిపాపాన వాడేపోవుచున్నాడు నీవి
కనా మనస్సునకు కలత పుట్టించవద్దని పలికెను - అంతట దమనకుండు చెప్పుచు
న్నాడు మీరు తన్ను మిక్కిలి గౌరవించి పెద్దమంత్రిని జేసి రాజ్యతంత్రాలు వ
శము చేసి యెల్లప్పుడున్ను సమస్తవిషయములయందున్ను నమ్మియుండగా ఆత
డిది యెంతమాత్రమున్ను మనస్సులో నెంచక మీ రాజ్యము బొత్తిగా నపహ
రించవలెనని ఆలోచన సేయుచున్నాడు- అది నాకు తెలిసినదిగనుక శీఘ్రము
గా దేవరవారికి తెలియజేయవచ్చినాను అన్నదమ్ముడైనాగాని కుమారుడై
నాగాని మంత్రిస్థానప్రపనులు జరుపుచున్నప్పుడు వానిమీద దృష్టియుంచక పో
తే రాజుయొక్క లక్ష్మి తొలగిపోవును సుజనులయొక్క హితవాక్యములు చె
విసోకనీయక దుర్జనులు చెప్పిన బుద్ధులే మనస్సున పెట్టుకొని కార్యములు జరిగిం
చిన రాజు అపథ్యములైన వస్తువులను భక్షించిన రోగివలె నశించును ఇది నిశ్చ
యము స్నేహితులమాటలు విన్న రాజు సుఖముగానుండును - శత్రువుల మా
టలు విన్నరాజు శీఘ్రముగా రాజ్యము పోగొట్టుకొనును అప్పటికి అప్రియము
గానుండినా మీదటికి ప్రియముగానుండే మాటలు చెప్పేవారు కొరకను దొ
రికినాగాని అటువంటి మాటలు బుద్ధిమంతుడే వినును గాని యితరులు వినరు వి
న్నవారిని లక్ష్మి యెడబాయకుండును హితమును కోరే వారు తెలిసినవారుగా
నుండరు తెలిసినవారు హితమును కోరే వారుగానుండరు తెలిసినవారుగా
నున్ను హితమును కోరే వారుగానున్ను వుండేవారు దొరకడము రోగమును
హరించేదిగానున్ను రుచిగలదిగానున్ను వుండే ఔషధమువలెనే అరుదు పా
తకొలువుడుగాండ్లకు విరోధముగా కొత్తగా వచ్చినవారి విసన్మానించినట్టయి
తే అది రాజ్యము చెడిపోవుటకు మూలము- అనిన విని సంజీవకునకు నేను అభయ
మిచ్చి పెద్దమంత్రినిగా చేసి ప్రీతిగా నడిపించుచుండగా అతడు నాకు అపకా
రము సేయవలెనని దలచునా ఇవి యెక్కడి మాటలని పింగళకుండు పలికెను
అంతమీదట దమనకుండు పలుకుచున్నాడు దుర్జనుడు తన్ను పూజించి
నవానికైనా తనకపరాధము జేసినవానికైనా యపరాధమే చేయును పాము
ను తలమీద యెక్కించుకొన్నా కాలితో తన్నినా కరవనే కరచును దుర్జనుడెల్ల
ప్పుడున్ను సేవింపబడుచున్నవాడైనా తన స్వభావమును విడువడు కుక్కతో
క చమురు పట్టించి తోమి వంచినా దాని వంకర పోవునా పూజ్యముగాని పదార్థ

మెక్కడనున్న పూజ్యముగా నేరదు అమృతధారలు పోసి పెంచినాము సిని చెట్టుకల్పవృక్షమువలె పూజ్యమగునా చక్కెరలో తేనెపోసి కలిపి పాదిచేసి వేపవిత్తనాటి పాలుపోసి పెంచితే ఆ వేపచెట్టు తియ్యగా నుండునా డుత్తముడైనవాడి శోకకు అపాయము వచ్చునప్పుడు విచారించి తెలుసుకొని వారితో ముందుగా జెప్పును దురాత్ముడైనవాడు తానుగుతైనిగి యుండిన్ని తనమనస్సులోని దినిమిత్తముగా నొకపగబట్టి చెప్పడు ఎంతమంచితనముగా నుండినన్నా వైరము మనస్సులో నుంచుకొని కోపముగలవాడు దుర్జనుడు మంచితనము చేత సంతోషించేవాడు సుజనుడు చెరుకున్ను వేపచెట్టున్ను తమరసము చేతనే తెలియబడుచున్నవి అటువలెనే సుజనుడున్ను దుర్జనుడున్ను తమస్వభావము చేతనే తెలియబడుచున్నారు వృశ్చికమునకు విషము తోకయందుండును సర్పమునకు విషము ముఖమునందుండును దుర్జనునకు విషము శిరస్సునుంచి పాదములు దాక నుండును కపటము లేనివాడే మిత్రుడు యుద్ధరంగమునందు దనస్వామికార్యమునకు వెనకదీయనివాడే భృత్యుడు కపటమును పుట్టించనిదే సంపత్తు సత్పురుషుల చేత ప్రార్థింపబడ్డవాడే బుద్ధిసంపన్నుడు ఇంద్రియములను జయించినవాడే సిద్ధుడు హితులుమాట విన్నవాడే రాజు అనిదమనకుండు పలికిన సంజీవకుని మీదపింగళకునికి మనస్సు విరగకుండుట ఎరిగి మరియు నిట్లనియె ఓమృగముల సార్వభౌమా నేను ఎంత విజ్ఞాపన చేసినప్పటికిన్ని సంజీవకునియందు గలిగిన మనస్సు తిరగలేదు కాబట్టి యిక్కమీద భృత్యునియందు దోషము లేదు అధికకామాసక్తుడైన రాజు కార్యాకార్యము లెరుంగక మదించిన యేనుగవలె ఇచ్ఛవచ్చినట్టు సంచరించును తర్వాత మంత్రి మొదలైన వారి దోషములు బాగా విచారించనందున వారిని శిక్షింపలేక శోకార్ణవములో పడును అప్పుడు భృత్యునియందు తప్పు లెంచును గాని తనతప్పు తాను తెలుసుకోలేడు,

అనిన విని సంజీవకుని నిరాకరించి వెళ్లగొట్టుదమా అనిపింగళకుండడిగెను స్వామీ అట్లాచేసే మంత్రము భేదించును నిరాకరించిన వెనక సంజీవకుడు నిండా అపకారము చేసును పరిపక్వము కాయిన మంత్రము నే బీజమును ప్రయత్నము చేత రక్షింపవలెను అది కొంచమైనను భేదింపకూడదు భేదింపబడ్డట్టయితే చెడిపోవును అని దమనకుడు చెప్పెను సంజీవకుడు మనకు అపకారము చేసునా అని పింగళకుండడిగెను వాని స్వభావము తెలియదు గనుక మనమెట్లా నిశ్చయించవచ్చును యెవనికైనా వాని స్వభావము తెలియక నే చోటివ్వగూడదు అజ్ఞాతమైనస్వభావము గలడిండిమమునకు చోటిచ్చినందున మందవిసర్పిణిన్ని మృతిబొందె

ము అని దమనకుడు చెప్పెను ఈమాటలు విని పింగళకుండా కథ యెట్లని యడిగి
న దమనకుండిట్లనియె,

**శ్రీ పింగళకునకు దమనకుండు చెప్పిన నల్లికథ,**

మందవిసర్పిణి యనునొక చీరపేను బహుకాలమునుంచి రాజు యొక్క
పడకలో చోటుచూచుకొని యెక్కడికిని పోక అక్కడనే వుండగా డిండిమ
మను పేరుగల ఒక నల్లి గాలి చేత ఆపడక మీద పడెను- అప్పుడు మందవిసర్పిణి
అతిథిసత్కారము చేసి పొమ్మనెను- నీ అనుగ్రహమువల్ల నేనిక్కడనే వుండిని
న్నొకటి యాచించవలెనని యున్నాను- నీకు నమస్కారము చేసెదను- నేనె
న్నడున్ను అన్యుల యాచించినవాడను కాను నాకోరిక నెరవేర్చవలెను నీగు
ణములు నిండా ప్రసిద్ధములుగానున్నవి నీవంటివారు లోకములో లేరని నల్లి పలి
కెను ఆమాటలు మందవిసర్పిణి విని నీవింత స్తోత్రము చేయనేమిటికి- నాపుణ్యవ
శమువల్ల నీవిక్కడికి వచ్చితివి నావంశము ధన్యమాయెను నేను నీయనుగ్రహము
వల్ల ఈ రాజశ్రేష్ఠుని పానుపునందు సుఖముగానున్నాను ఇపుడు నీవు నన్నేమి
యడుగవలెనని వచ్చితివి నాపరువు చూచి నన్ను యాచించుమనెను- అందుకు
డిండిమ మిట్లనియె- యాచకుడైనవాడు తనకు గావలసినది యడుగును గాని
దాత యొక్క కలిమి లేములు జూచి యడుగునా - అర్థాశ చేత మిక్కిలి యరు
చును గాని యితడు లోభి యితడు దాతయని యెఱుగునా -తన లేమిడి చేత నిత
రులను శ్రమపెట్టునే గాని ఇది గొప్ప ఇది కొంచమని తెలిసి యాచించునా ధనా
పేక్ష చేత సభలయందు బ్రసంగించ నారంభించును గాని తనకు విద్య చాలదని
చెప్పు ధనవంతుల వెంబడి తిరిగి తన నేర్పు చేత వారిని యాచింపగా దాతయ
గువాడు మెచ్చి ధనమిచ్చి తే సంతోషించును లోభియగు వాడు ధనమివ్వకుం
టే చిన్నబోవును ఇది యాచకుని స్వభావము నేనిప్పుడగ్ధకాంతు చేత దిన్నడుగ
రాలేదు నాకొక సహాయము మాత్రము చేయవలెనది యేమంటే మనవు నేనె
ప్పుడున్ను మానవుల రక్తము పానము చేయుచుందును గాని రాజు యొక్క దేహ
మునందు గలిగిన రక్తమెన్నడున్ను పానము చేయలేదు అది మనస్సులో బెట్టుకొ
ని నేడు నేను నీ యొద్దికి వచ్చితి విందుకు నీవు సమ్మతించి నాకోరిక తీర్చవలెను ఇటు
వంటి కోరిక గలుగుటకు కారణం బేమంటే జెప్పుచున్నాను విను మున్నబియ్య
పు వంటకము అప్పుడు వెన్న గాచిన యావు నెయ్యి కమ్మని కంది పప్పు మంచి కూర
లు రుచిగల భక్ష్యములు నానా విధములైన ఫలంబులు పానకంబులు మాంసఖండ
ములు తియ్యని యావుపాలు మద్యము దోసగాయలు దోరుబిండ్లు గెడ్డ పెరుగు
చిక్కని చల్ల మజ్జిక లేత చక్కెర వటిక బెల్లము మంచి మధుదకము వక్కలాకులు పరి

హా శముగలగంధపుష్పములు మొదలగువస్తువులను దినదినంబు ననుభవించు శృంగారవంతులైన స్త్రీలతో భోగింపుచు సుఖించుచున్న రాజుల దేహార్థకములు హురుచిగా నుండునని వినియున్నాను ఇదివరకెన్నడున్నది నాకు సిద్ధించలేదనిన ల్లిచెప్పగా విని మందవిసర్పిణి చెప్పుచున్నది నీదంతములు బహుతీక్ష్ణములు నీవు సహాయముచు గస్తురెరుగవు నిన్నిక్కడ చేర్చితే నాకు మోసము వచ్చును ఈ రాజుయొక్క శయ్యయందు రాత్రి బగులు నాపాయంబుతో నుండుట విడిచిపావి పుట్టుటకు ప్రయత్నము జేతువు దుష్టులు సుజనులకు అపకారములే వెతుకుచుందురు అది వారి సైజగుణము కాబట్టి నీ పలుకులకు కొంచమైనా నేను సమ్మతించను నీమీద కోపించుకొందునని నడిండిభు డిట్లనియె నీవున్న చోటికి నేను వచ్చినాను నీదయచూప నడిపించవచ్చును నేనిప్పుడు నీపాదములకు మ్రొక్కుచున్నా నిట్యాంతరములు చెప్పక నేనడిగిన మాటకు సమ్మతించవలెనని చెప్పగా మందవిసర్పిణి దాక్షిణ్యమువల్ల సమ్మతించి డిండిభునితో నిట్లని మొదు పాయ మెరిగి త్వరపడక సురతశ్రమచేత పరవశుడై సుఖనిద్ర నుపొందియున్న రాజశ్రేష్ఠుని దేహము మెల్లగా ఆదిగ క్తమును పీల్చి తొలగిపోవలెను మిక్కిలి మెళుకువతో నుండవలెనని నడిండిభునట్లు నేకానిమ్మని చీరపేనుతో బహుప్రీతిగా జెప్పి దానికి తెలియకుండా రాజు దగ్గిరికిపోయి సందెజాముననే కరవనారంభించెనప్పుడా రాజు నిద్రమేల్కొనియు లికిపడి లేచి కాళ్ళు పిసుకుచున్న పరిచారకులంజూచి నా శరీరము తేలుగుట్టినట్లుండుచున్నది శీఘ్రముగా దీపము తెచ్చిచూడండని పలికెను ఇంతలో నల్లి వకసందులో దూరెను వారు దీపము దీసుకవచ్చి వెతికి రాజు పాన్పునను న్నచీరపేనుంజూచి ఇదే రాజు దేహము గరిచెనని గాసిం జంపిరి కాబట్టి దుర్జనసహవాసము హానికరము వును. అనుననిదమనకుడు చెప్పిన పింగళకుడు విని నా పరాక్రమంబెరింగియు సంజీవకుండే పాధనంబులచేత నాకెట్లు ద్రోహము చేయునని ఉడికెను నీవేమది యొచింపవప్పుడు సంజీవకుండు దిన్నగొమ్ములతో గుచ్చి రొమ్ము భాగము ..కరములైన గొరిసెలతో దొక్కి పాదుగాటితో తోర్ఘూడించి కొట్టిను నయువచ్చినట్లు బాధించునను అనిదమనకుడు చెప్పెను అందుమీద పింగళకుండు కొంత సేపు చింతాక్రాంతుడై దమనకునింజూచి నీవిప్పుడు సంజీవకుని దగ్గిరికిపోయి అతని అభిప్రాయము తెలుసుకొని శీఘ్రముగా రామ్మని దమనకుని పంపించెను. తర్వాత దమనకుండు బహుపడ్డవాని వలె అక్కడక్కడనొదిగియొదిగి సంజీవకునివద్దకు చేరగా జూచినతండిది యేమి భయము వల్ల వణకుచున్నది వీమీరందరు కుశలమా అనియడిగిన సంజీవకునితో నిట్లనియెను.

ఓవృషభరాజా రాజును గొలిచేవారికి కుశలమెక్కడిది సంపత్తులు పరాధీన

టగలడనిమిత్తముగలిగికోపముచే సేవకుఁడైతే కొలువవచ్చునుగాని బుద్ధిహీను
లేక నెతప్పులు వెదుకుచుండే రాజును కొలువశక్యమా. పింగళకుఁడు చెప్పుడు
మాటలువినేవాఁడుగాని స్వబుద్ధివల్లనడచేవాఁడు కాఁడు పైదుష్టుఁడు విద్వాంసుఁడు
మంత్రియైనముష్కరుఁడున్నదే రాజునకు ఇచ్చకములాడుచుండురో ఆరాజు అ
తోఁగ్గనటువంటిధనమును బొక్కసమును శీఘ్రముగాపోగొట్టుకొనును. ఆరా
జునకు నేనుకీడుగలచ లేదు నాయెడలనిర్నిమిత్తముగానితఁడపకారమోంచెను.
గుణవంతులతోఁ జేరినపురుషుఁడు గుణవంతుఁడేయగును దుర్గుణులతోఁ గూడినట్ల
యితే తీయనియుదకము గలనదులు లవణసముద్రమునఁబడి చెడిపోయినట్లువా
నిగుణములు చెడిపోవును వెండికొండమీఁద చంద్రకిరణములుమిక్కిలిప్రకాశించిన
ట్లుమంచిగుణములుగలపురుషునియందు అల్పగుణమైనా ప్రకాశించును. కాటు
కకొండయందు రాత్రివేళ పూర్ణచంద్రకిరణములు ప్రసరించి ప్రకాశించన
ట్లు చెడుగుణములుగలవానియందు మంచిగుణములెన్నిఅయినా ప్రకాశించవు
దుష్టులకు యెంత ఉపకారము చేసినా మూర్ఖులకెంతవిద్య నేర్పినా చెప్పినట్టువి
నని వారికిఎన్ని బుద్ధులు చెప్పినా అపాత్రులకెంత యిచ్చినా ఫలము లేదు అడవి
లో నేడవడము న్న పీనుగను అలంకరించడమున్ను గట్టనేలను తామరతూడడము
న్ను కుక్కతోఁకచక్కచేయుటకై బద్దలుపెట్టికట్టడమున్ను చెవిటివానితో నే
కాంతము గమాట్లాడడమున్ను చవుటనేలను వర్షించడమున్ను గుడ్డివానికి అద్ద
ము చూపడమున్ను బూడిదెలో నెయ్యి హోమము చేయడమున్ను ఎట్లా నిష్ఫ
లములో అటువలెనే అవివేకియైన రాజును గొలువడమున్ను నిష్ఫలము. మంచి
గంధపు చెట్టు పాములచేత చుట్టబడియున్నది కొలనిలో మొసళ్లు గలిగియున్నవి క
మలములు బురదలో బుట్టుచున్నది సౌందర్యముగల స్త్రీ కుటిలస్వభావము గలిగి
యున్నది శ్రేష్ఠమైనవస్తువు నిరుపద్రవముగా నెక్కడనున్నది లేదు సేవకులు
వివేకియైన రాజును గొలిచితే భయములేదు దమనకుఁడు తనయొద్దకి వచ్చిన
వానిని జూడఁగానే బహువినయముతో లేచివచ్చి నిచూపు చూచియాలింగనము
జేసుకొని తనయథాసనములో కూర్చుండబెట్టుకొని లోఁగా విషము నుంచు
కొని బైటికృత్రిమమైన కేటట్టు ప్రియములు బలుకును బ్రహ్మదేవుఁడు సముద్ర
ము దాటుటకోడను చీఁకటిబోగొట్టుటకు దీపమును పసుగను శిక్షించుటకంకుశ
మును గాలి లేనిచోట గాలివచ్చుటకు విసనకఱ్ఱను ఉపాయముచేత నిర్మించిపది
వేలవిధములచేతను దుర్మార్గుల చిత్తవృత్తినిపోగొట్టుటకు ఉపాయము చే
యనేరకపోయెను సాయంకాలమందు సూర్యాస్తమయ సమయమున పశ్చిమదిక్కునందు
[illegible] సూర్యుఁడు కమలములలో ప్రవేశించిన [illegible]

మలములు తొలగించుకొనగా నైనను తిరిగి వెళ్లి వచ్చేమార్గము గానక విచారపడునట్లు కొందరు మానవులు మీకవచ్చు నదిగు తెరుగక లోభము చేత ప్రవర్తించుదురు కమలములు కలువలు మొదలైన పుష్పములు విడిచి పెట్టి మ్మెదలు మదించిన యేనుగయొక్క గండస్థలమునందలి మదజలమును పానము చేయపోవుచున్నప్పుడా యేనుగ చెవులతో విసిరిన గాలికి నేలబడి తామరలలో తాము విహరించుటను తలచుకొనుచున్నట్టు అటువలెనే లోకములో జనులు సులభులైన వారిని విడిచి పెట్టి దుర్జనులయందనురక్తిగలవారై అక్కడ ఉపద్రవము సంభవించినప్పుడు సుజనుల దగ్గిరికిపోయి సేవించక పోతిమని విచారపడుచున్నారు అడవిలోనున్న కసువు దిని ప్రభువునకు హితమైన కార్యము చేయుచుండెడి నాకిప్పుడు మృత్యువు నోటబడవలసివచ్చె నీకలికాలమందు మీరు పెద్దలు పేరుపన్నులనక మారోగవాయువుల చేత పతితమగుచు వారు కాకి మొదలైన జంతువులేకమై ఒంటెకు కీడు తలచినట్లు సాధులకు కీడుదలచుచుందురని పలికిన దమనకుండా కథ నాకెరుంగింపుమనెను సంజీవకుడు చెప్పుచున్నాడు.

మహాభయంకరమైన యొకయడవియందు మదోత్కటుడను పేరుగలిగిన యొక సింహము సంచరించుచుండును దానికి కాకి పులి నక్క ఈ మువ్వురు జంతువులుగానుండిరి వారొకనాడడవిలో నొక ఒంటెను చూచి నీవెక్కడినుంచి వచ్చితివని అడిగిరి ఆ ఒంటె కాకి మొదలైన జంతువులకు వందనముచేసి యిట్లనియె ఒక వర్తకుడు నా వీపున బరువు పెట్టి మోయించుచుండగా మోసి మోసి సిక్కిపోయి వానికి అనుపడకుండా దాగియున్నాను నాకు మీరే గతి నన్ను రక్షింపవలెను నేను మీయొద్దనుండెదననిన నక్క యిట్లనియె. ఈ అడవిలో నొక మృగరాజు మహాబల సంపన్నుడై యున్నాడు మేమతని మంత్రులము స్వామిగా జేసుకొని యెప్పుడున్ను సేవించుచుందుము నీవున్ను మాకత్యంత ప్రియమిత్రుండవు గనక మృగరాజు దగ్గిరికి నిన్ను బిలుచుకొనిపోయి దర్శనము చేయించి నీకు మేలు గలుగునట్లు చేసెదము నీవు భయము విడిచి ధైర్యముతో నుండుము మామాటయందు నమ్మిక గలిగి మమ్ము కొత్తవారినిగా నెంచక వచ్చినట్టయితే నీ సంగతి మృగరాజునకు దెలియ జెప్పి నీయందు ప్రీతి పుట్టించి నిన్ను తమ కొలువు చేయించుకొనునట్లు చేసెదము మనము నలుగురమేకీభవించి యుందము మృగేంద్రుని గొలిచియున్నవారి నెవ్వరైనా వంచగలరా యేవిచారము లేక నెమ్మదిగా నుండవచ్చునని చెప్పగా నొంటె తన మనస్సులో సంతోషించి వారి వెంట పోయెను వారున్ను ఈ ఒంటె సంగతి మృగరాజుతో జెప్పిరప్పుడా మృగరాజు ఒంటెకభయహస్తమిచ్చి సంతోషపెట్టి కొంత సేపు మాట్లాడి వానికి క్రథనకుండను పేరుపె

ట్టిమునుపటి నామంత్రులందు నీవునొక్క మంత్రివైయుండుమని నియమించెను
ఆటెంటె కాక వ్యాఘ్ర జంబుకంబులతో గలసి అతిస్నేహంబున బహుకాల
ముండెనీ మంత్రులు కాలము జరుగుచుండగా నొక నాడు సింహము కాకి వ్యా
ఘ్ర జంబుకోష్ట్రములం జూచి యిట్లనియె .... ... ... ......
ఓ మంత్రులారా నాదేహమునకు జాడ్యము వచ్చినది ఈజాడ్యము నాకుమ
దిరేదాకా నేనడవిలో సంచరింపజాలను కాబట్టి నాకు పెందలకాడ నాహార
ము దెచ్చి యివ్వవలయునని పలుకగా మంత్రులందరేకీభవించి స్వామీ మేము
ల్పులము గనుక మీకు గావలసిన యాహారంబొక పూటకైనా తెచ్చి యివ్వగల
మా మేము మీపాద సేవ చేసుకొని మీరు భుజింపగా మిగిలినది భక్షించి జీవిం
పుచున్నాము మే మెంతమాత్రపు వారమని పలికిరప్పుడా సింహము వారిం జూ
చి యెంతమాత్ర మాహారము దొరికినా చాలును కొంచముతోనే ప్రొద్దుగడుపు
కొనియుండెదనే సమితేయిందును నాకీ పాపపు తెగులు సంభవించెను దైవము
నన్నుజూచి ఓర్వలేక యిట్లు జేసెను కాబట్టి జాగు సేయక యడవికిపోయి యే
మాంసమైనా నెంతమాత్రమైనా తీసుకరండి శీఘ్రముగా బొండని వారినంపిం
చెనంతట వారు నలుగురున్ను శీఘ్రముగా బోయి యడవిలో పొదలయందున్న
పుట్టలయందున్న చెట్లయందున్న కొండలయందున్న దొనలయందున్న పొ
నలయందున్న ఏమృగమునైనా గానక తర్వాత నలుగురు నాలుగుదిక్కు
లకు చెదరిపోయి వెతకుచుండగా కాకి వ్యాఘ్ర జంబుకంబులొకచోట గూడు
కొనెనప్పుడు కాకి వ్యాఘ్ర జంబుకములను జూచి మనము స్వామి పని బూని వచ్చి
నందుకు ఈయడవిలో నేదిన్ని దొరకక పోయెను. ఈ కదనకునిం జంపి తీసుకొ
నిపోయి యతని నాహారముగా జేసితే మంచిదిగదా మిగిలిన మాంసంబు మన
కు కొన్నిదినములు ఉదరపోషణమునకు చాలు నిదివరకు జరిగిన కాలములోన నే
క మృగమాంసముల చేత మనలను పోషించిన రాజునకు మనమీ సంకటము పో
గొట్టవలెనని పలికిన కాకికి నక్క యిట్లనియె మిక్కిలి దయతో నితనికి భయమి
చ్చి అందరికంటె నెక్కువగా మన్నించుచున్న రాజునకు తెలియకుండా మన
మతని జంపితే తర్వాత రాజెరింగి మనమీద కోపము జేసి యాజ్ఞ సేయించు
నుకాబట్టి మనస్వామి యెరుగకుండా వీనిం జంపుట యుక్తంబు గాదని పలికిన
కాకి యిట్లనియె అధిక క్షుధ చేత పీడితుడైన మానవుండు తన యాకలికి బిడ్డలనో
ళ్లడు సర్పము తాను బెట్టిన గుడ్లను క్షుత్తు చేత తానె భక్షించుచున్నదిదవల్లప్పివ
చ్చినప్పుడు ఆకలిగొన్నవాడు పాపము సేయక నిశ్చయించకుండునా మనమీ
యాకలిచేత బ్రతుకలేము యెక్కడకైనా తొలగిపోజాలము నిమిక్కిలి బిగిసుకుకొ

నేనప్పుడా కాకితో పులి యిట్లనియె ఓసస్వామి మహావ్యాధిచేత పీడితుడై
యాకలిగొనియున్న వేళ మనయంతనిపడిబెట్టితోలగిపోవుట భృత్యన్యాయం
బుగాదతనిసముఖంబునకుఁబోయినంతటవదృష్టప్రతీకారము జరుగుచున్నదిపో
దామనిలేవి కదలుచుండనవసరంబున కదనకుడునుగలుపుకొని నేనుతర్వాతము
గ్గురుంగదనకునిందల వాకిటనిలిపి ఆసింహముదగిరికిబోయియిట్లనిరి.ఓమహా
ప్రభో మేముమీయాజ్ఞచొప్పున భయంకరమైనయడవులకుబోయి అక్కడ
మాంసముదొరకక తిరిగి వచ్చితిమి ఇప్పుడాహారములేక ప్రయాసపడవలసిన
దేమి- మేమొక ఉపాయము చేయుచున్నాము చిత్తగించండి కదనకుడు తన
కార్యముకొరకై మీయొద్దకి వచ్చినాడు గాని మీరు పిలుపించగా వచ్చి
నవాడు కాదుగదా- కాబట్టి అతని నాహారముగా చిత్తగించితే మీకునూ మాకు
కూడా కావలసినంత భోజనమౌనని పలికిన సింహము విని- హరిహరీ- యని
చెవులుమూసుకొని అభయప్రదానము చేసినవెన్నక యిటువంటిమాటలు
తలచవచ్చునా గోదానంబును భూదానంబును అన్నదానంబును సువర్ణదానం
బును-అభయప్రదానమునకుసరిగావని పెద్దలు చెప్పుదురు భయపడి మరుగు
జొచ్చినవానినొకనిరక్షించితే నశ్వమేధయాగము చేసినఫలమువచ్చు నని చె
ప్పగామీరువినలేదా- యనిపలికెను తర్వాత నాముగ్గురిలో నొకటి యిట్లనియెం
కులమునురక్షించుటకై దుష్టుడైనకొడుకునువిడుతురు గ్రామమునురక్షించు
టకై కులమునువిడుతురు భూమిని కాపాడుకొనుటకై గ్రామమును విడుతు
రు ఆత్మను కాపాడుకొనుటకై భూమినివిడుతురు కాబట్టి దేహసంరక్షణార్థము
యేమిచేసినా చేయవచ్చును అదియునుంగాక మీరు కదనకుని బలాత్కార
ముగాజంపవలెనని లేదు అతడుసమ్మతిబడునట్టుగా చేసెదమనిపలికిన విని సింహ
ము ఊరకుండెనపుడు కాకి సందుగనుక్కొని సమాలోచనము చేసియందరి
నిపిలుచుకొని సింహము దగ్గరికి వచ్చి స్వామి మీరు నిండాక్షుత్తుచేత బడలి
యున్నారు నన్ను జంపి భక్షించండి మీరు దాక్షిణ్యముచేత నన్ను జంపజాలకుం
టే నేనే చచ్చెదను నన్ను భక్షించి మీయాకలి దీర్చుకొండి యిది నాకుమిక్కి
లిసంతసంబు వెయ్యేండ్లకైనా చావుసిద్ధంబు ఇట్లా స్వామికార్యమునకై ప్రాణ
ము విడుచుటచేత జన్మము సఫలమౌనని పలికెను అనవిని సింహమిట్లనియె
నాకిప్పుడున్న యాకలి చెప్ప తీరదు నీ దేహము బహు కొంచెము అది తిం
టే నా యాకలి తీరదు వృథాగా జీవహింస చేసినదోషము సంభవించునని
సింహము చెప్పగానే నక్క ముందటనిల్చి నాదేహము నీకిచ్చితిని నీవు భక్షించు
మని సింహముతో జెప్పెను సింహంబు కాకివలెనే

తట వ్యాఘ్రము వచ్చి సింహమునకు నమస్కరించి నన్ను భుజించి మీ యాకలి దీర్చుకొనవలయునని చెప్పె నందుకు సింహము పులిని జూచి నీవు గోవులను బ్రాహ్మణులను భక్షించి దేహము పెంచుకొని యున్నావు నిన్ను భుజించితే నాకు బహుదోషము వచ్చును నేనిదివరకు యిట్టి దుష్టజంతుమాంసమెన్నడున్ను భుజించినవాడను గాను ఈదినమున్ను యెట్లాగైనా ఉపవాసముండెదను తొలగిపొమ్మని పలికె నామాట నువ్యాఘ్రము సిగ్గుపడి చిన్నబోయి వచ్చినవలెనే మొగము వంచుకొని అవతలికి బోయెను. తదనంతరంబున ఒంటె సింహమునకు ప్రదక్షిణము చేసి అతివినయముతో స్వామీ నాది బహు గొప్ప దేహము నన్ను భక్షించితే మీ యాకలి తీరును నాకును స్వర్గము గావిన్ను విరచేసెను నాకు నవిచ్చితి గావ వలయునని చెప్పెను యీమాట చెప్పగానే సింహము లోటిపిట్ట పైనబడి మెడ బట్టుకొని కరచి నేల పైబడవేసి తనకు కావలసిన మాంసము భక్షించెను కాబట్టి క్రొత్తగా కొలువునకు వచ్చిన సేవకుండెంత బలవంతుండైనా రాజును రాజపరివారంబులకును కూడను కలసి యుండ నేరదని పలికిన సంజీవకుండు దమనకునితో నాకు గలస్నేహిని రాజు దగ్గర దుష్టపరివారము చేరియుంటే వాశ్రితులకు సుఖము లేదు. స్వర్గకాలమునందు యుష్టలు గలిగిన నక్క తీక్ష్ణమైన ముక్కుగల కాకి యీ మూడు భయములున్నని పార్శ్వములయందున్నారు గనుక నేను చెట్టిక్కినాను నీపరివారము మంచిది గాదని నొకవడ్లవాడొక సింహముతో చెప్పిన మాట నీవు వినలేదాయని సంజీవకుండు చెప్పగా నదమనకుండా కథ నాకు చెప్పుమనియడిగెను సంజీవకుండు చెప్పుచున్నాడు. ఒకపట్టణములో నొకవడ్లవాడు గలడు వాడు ప్రతిదినము న్నడవికి పోయి గుంజలు మొదలైనవి కొట్టి తెచ్చి అమ్మి జీవనము చేయుచుండును ఒకనాడు మహాక్రోధుడను పేరుగల సింహము అడవిలో సంచరించుచు వీనికి గనుపడెను. వీడు సింహమును చూచి భయపడి నిశ్చేష్టితుడై వుండెను సింహము వానికి యభయమిచ్చి భయపడవద్దని చెప్పె నంతట వాడు నీకయింటి నుంచి తెచ్చిన యన్నము మొదలైనది సింహమునకు పెట్టెను సింహము తృప్తిబొంది వీనిమీద విశేషదయగా వుండెను తర్వాత ప్రతిదినము న్నవాడు సింహమునకు నానావిధములైన యాహారములు తెచ్చి యిస్తూవచ్చె నీప్రకారముగా నిద్దరికిన్ని బహు స్నేహముగా బహుకాలము జరిగెను - ఆ సింహమునకు ఒక కాకి ఒక నక్క ఇద్దరు అనుచరులు గలరు వారొకనాడు సింహమును జూచి మాకు యాహారమును విచారించవుండా మీరు మాత్రము ఆహారము సంపాదించుకొనుచున్నారు మాగతి యేమని అడిగిరి నేనెక్కడికిన్ని పోవడము లేదని సింహము చెప్పెను అయితే మీకు ఆహారమెవరు తెచ్చి యిస్తున్నారు మాతో చె

వ్వవలెనని వారడిగిరి ఒక కల్లవాడు ప్రతిదినము న్నన్న పానాకులు తెచ్చినా డుయున్నాడని చెప్పెను-కాకు వానిం జూపించుమని కాకి జంబుకములు పి లిచెను-తర్వాత ప్రాగ్భాగమందున్న అడవిలో నొకచోట కూడియుండెరి వడ్ల వాడు వరి వాగముతో గూడుకొన్న సింహమును జూచి చెప్పెకెను-సింహము వానిదగ్గిరికి పోయి స్నేహితుడా యెందుకు వచ్చెకి-నావని అడిగెను - కుయు క్తులు కలవక్కడ తీక్ష్ణమైన ముక్కులుగల కాకి - యీ భయములున్న నీ పార్శ్వముల యందున్నారు గనుక చెప్పెకి-నాను నీవరివారము నుంచిది కాదని చెప్పి వాడు చెట్టు విగక పోయెను-గనుక ఆనేకులైన దుష్టుల యొక్క నొక సజ్జనుడుంటే వానికి దుష్టుండని పేరువచ్చును - ఊరిదగ్గిర స్మశానభూమిలో నుండేడు గద్దలతో గూ డానొక హంసవచ్చియుంటే చూచేవారు దాన్ని గద్దయనుకొందురు గాని హం సయని తెలుసుకోలేరు-రాజుదగ్గిర యోగ్యులుంటే యెక్కడికివచ్చినవాడు అ ల్పుడైనా గుణవంతుడౌను-పెక్కు కొంగలలో నొక గద్దయుంటే దాన్ని చూచే వారు హంసయనుకొందురు కాని గద్దయని తెలుసుకోనేరరని పలికి సంజీవకుండు మరియు నిట్లనియె-రాజుదగ్గిర నెవ్వడో దుర్మార్గుడు చేరి నజంబుకల్లయుక్తుల్లని జంబుగా జెప్పినాయందు భేదము పుట్టించినాడు కార్యంబు తప్పి ఇచ్చె నేమిచే యుదును భూమిలో పిడుగును-రాజపరాక్రమంబును అతిభయంకరంబులు అందులో - పడుగొక్కచోటంబడును రాజపరాక్రమమైతే వగవాని రాజ్య మనందంతట వ్యాపించును-యిప్పుడు నేన తనితోడ యుద్ధంబు చేసి మృతిబొందు ట మేలుగాని యతని యాజ్ఞలో నుండుట యుక్తంబుగాదు- కార్యాకార్యంబు లెరుంగక గర్వించి దుర్మార్గమున వర్తించుచున్న గురువునైన విడువవలసి నది-మంచి యజ్ఞములు చేసినవారున్ను-అనేక దానములు చేసినవారున్ను-సమ స్తపుణ్యతీర్థములలో స్నానము చేసినవారున్ను-ఎటువంటి పుణ్యలోకముల బొందుదురో - అటువంటి పుణ్యలోకములను యుద్ధమలో ప్రాణములను వి డిచినవారు క్షణములో బొందుచున్నారు-యుద్ధమందు జావు నొంది బొంది తేస్వర్గలోకసుఖము ననుభవించవచ్చును - తనచేత శత్రువు చచ్చినట్టయితే వానిసంపదలను సంతోషముతో ననుభవించవచ్చును- యీ రెండును శూరు లను త్తమగుణములు కాబట్టి యిది నాకు యుద్ధకాలమని సంజీవకుండు పలికిన దమనకుండిట్లనియె కణమరణంబు మంచిదని యసాధ్యమైన శత్రుబలముమీద బడవచ్చునా శత్రుపరాక్రమంబు తెలియక నెవ్వడు విరోధించునో వాడపజ యంబునొందును యూను పుటిట్టిభంబువలన సముద్రుడపజయంబునొందలే దా అని పలికిన సంజీవకుండు అకథనా కెరింగింపుమనె దమనకుండిట్లనియె

——— దమనకుండు సంజీవకునకు చెప్పిన టిట్టిభునికథ. ———

సముద్రతీరంబున నొక చెట్టుమీద టిట్టిభ మను తీతువుపక్షి గూడు కట్టుకొని
తన భార్యతో గూడ కాపురము చేయుచుండెను కొన్ని దినములకు దాని భార్య
గర్భవతియై యుండగా నాపక్షి భార్యను జూచి వేవిళ్ళు బడుట యెరింగి నీకు ఏమి
కావలెనో చెప్పుము తెచ్చి యిచ్చెదనన భార్య పెనిమిటితో నాకేవస్తువు మీద
మనసు లేదు నామనసునందొక చింత పుట్టినది అది నివర్తింప జేయవలయును అ
దియేమనగా పర్వదినమునందు సముద్రము పొంగివచ్చును అప్పుడు మనము
గూడుకట్టుకొన్న చెట్టును దాకినట్లుగా కెరటములు వచ్చును నేను పెట్టిన గుడ్లన్ని
యు నీళ్లపాలైపోవును కాబట్టి మన మిప్పుడే యెక్కడనైనా ఒకచోటు చూచు
కొని పోవుటగాక యిది ప్రసవదినములు వచ్చినప్పుడు మరియొక చోటికి బోవుట క
ష్టమని పలికిన భార్యమాటలు విని తీతువుపక్షి నవ్వి చల్లనైన కిరణము
లుగల చంద్రుడు కలువలకు రక్షకుడు జారుచుండే స్వచ్ఛమైన నుదకములుగల
మేఘుడు చాతకపక్షులకు రక్షకుడు లోకమను యింటికి దీపమైన సూర్యుడు కమ
లములకు రక్షకుడు తేనిపక్షులకు గరుత్మంతుడు రక్షకుడు విష్ణువాహనమైన నగ
రుత్మంతుడు మనకు రక్షకుడై యుండగా సముద్రుడు మనతో పగచేకొను
నా అని పలికెను హితులమాట విననిమూఢుడు కొయ్యవిడచి పడ్డకూర్మమువలె
నేనశించునని ఆడతీతువు చెప్పెను ఆకథ యేలాగో చెప్పుమని మొగతీతువు
భార్యనడిగెను అప్పుడాయాడతీతువు చెప్పసాగెను.

——— తీతువపక్షి తనపురుషుడికి చెప్పిన తాంబేటికథ. ———

ఒకకొలనిలో కంబుగ్రీవమను పేరుగలయొక కూర్మము మహాసంతోష
ముతో బహుదినములనుండి వాసము చేయుచుండెను ఆకూర్మమునకు వికట
సంకటములను పేరుగల రెండుహంసలు మిత్రములై ఆసరస్సులోనే కాపుర
ముండెను తర్వాత కొన్ని దినములకు వర్షము లేక కొలనంతా యెండిపోవుచుం
డెను అప్పుడీహంసలు మఱియొకస్థలమునకు బోవలెనని యెంచి కంబుగ్రీవ
మునద్గరికివచ్చి మేమీచోటువిడిచి స్థలాంతరమునకు బోవుచున్నాము సెల
విమ్మవలెనని పలుకగా కూర్మము విచారగ్రస్తమై మనము బహుదినములనుండి
స్నేహము చేసియుంటిమి మీకు రెక్కలుగలిగినందున పోవలెనన్నచోటికి బోయ్యే
శక్తిమీకు కద్దు రెక్కలు లేని నేనెక్కడికి పోగలను నేనేమి సేయుదును మిమ్మెడ
బాసినిమిషమైనా బ్రతుకగలనా అని యెండాదీనముగా మాట్లాడెను అంతట వి
కటసంకటములు దానిదుఃఖము జూచి కొంతసేపు యోచించి ఓకంబుగ్రీవమా
మే మొకయుపాయము చెప్పుచున్నాము నీవు భయపడక మామాటప్రకారము

నడుచుకొనెట్టయితే నిన్ను మాతో గూడా తీసుకొనిపోయెదమనిన నొక
కొయ్య మే మిద్దరము చేరి యొకతట్టున ముక్కున గరచుకొను రెక్కలతో నెగిరిపో
తాము నీవా కొయ్య నడుగట్టిగా నోటగరచుకొని నోరు తెరవక యుండవలెనని
చెప్పెను ఆమాటకు కూర్మము సమ్మతించెను ఆహంసలు తెచ్చియిచ్చిన కొయ్యనడు
ధ్యభాగమున నోటగరచుకొనెను యంతట నాహంసలు కొయ్య చెరియొకవై
పు ముక్కున గరచుకొని ఆకాశమార్గమునబోవుచుండగా నొకపట్టణములోనుం
డె మనుజులు వీటినిచూచి యిదియేమి వింతయని బాహాధ్వనిగా మాట్లాడిరి అ
ధ్వనివిని దుర్బుద్ధియైన కూర్మమిది యేమి సందడియని హంసలనడిగెను తక్షణమే
కొయ్యపట్టువదలి క్రిందబడెను క్రిందబడగా నాహంసలు బుద్ధిలు దాని జంపి భక్షిం
చిరి కాబట్టి హితులమాటలు విననిమూఢుడు కొయ్యవిడిచి పడ్డ కూర్మమువలెనే న
శించునని చెప్పితిని పూర్వవృత్తాంతము దెలియుటకై మఱియొక కథ జెప్పె
దవినుము హితులమాటలు విననేర్చిన బుద్ధిమంతులు విశేషులైనవారిలో స్తోత్ర
ము చేయబడుదురు మునుపు అనాగతవిధాతయు ప్రత్యుత్పన్నమతియు యద్భ
విష్యుండను మీనంబులు గలవు అందులో యద్భవిష్యుండల్పమతిగాన ను
పాయము దెలియక చిక్కబడి మృతిబొందెనని చెప్పగా ఆకథ జెప్పుమని తీతు
వుపలికెను వానిభార్య చెప్పుచున్నది,

### శ్రీ ఆడతీతువపురుషునికి చెప్పిన యద్భవిష్యునికథ. శ్రీ

ఒక చెరువులో నిప్పుడు నే చెప్పిన మత్స్యములు మూడున్ను బహుదినముల
న్యోన్యస్నేహముచేత సంచరింపుచుండెను ఒకనాడు వాటిలో ననాగత
విధాతయిట్లనియె ఈ సంవత్సరము వర్షము లేనందున చెరువు నానాటికి ఇంకసా
గెను నీళ్లువట్టిపోయిన మరి యొకతటాకమునకు నిప్పుడే పోవలయును మనమాల
స్యము చేసిపోకనిలిచితే జాలరులపాలవుదుము మరియును నేనొక్కవిశేషంబు
వింటిని నేకగడియకుముందుగా కొందరుజాలరులువచ్చి యీచెరువుచూచి ని
ళ్లిశానాయెండిపోయినవి రెండుమూడుదినములలో వలలుదీసుకొనివత్తామని
యొకరితో నొకరుమాట్లాడుకొనిరి యింకమనమాలస్యము చేసితే కీడనుసం
భవించునని చెప్పగనామాటలువిని ప్రత్యుత్పన్నమతి యిట్లనియె ఇంతదూర
ము యోచించవలసినదేమి ఆపనిపొసగినప్పటికి విచారించుదము కార్య
ము పొసగినప్పుడెవనికి బుద్ధితక్కువగాక పూర్ణముగానుండునో వాడు తనకా
ర్యములు చక్కగా నెరవేర్చుకొనును ఒక గొల్లది యిద్దరుజారపురుషులతో
సంతితప్పించుకో లేదా అని చెప్పగా మత్స్యములా కథ యెట్లాగు చెప్పుమనె
ను ప్రత్యుత్పన్నమతి చెప్పుచున్నాడు.

### ప్రత్యుత్పన్నమతి చెప్పిన గొల్లదానికథ.

ఒకపట్టణములోనొక గోవ స్త్రీకలదు ఆ స్త్రీ చిగురుటాకులవంటి పాదము
లున్ను చుక్కలవంటి గోళ్లున్ను తాబేళ్లవంటి మీగాళ్లున్ను అరటిపొట్టలవంటి పి
క్కలున్ను అరటిచెట్లవంటి తొడలున్ను ఇసుకదిన్నెలవంటి పిరుదులున్ను సు
డివంటిబొడ్డున్ను పిడికిటిలోనణగే నడుమున్ను వలతాచువంటి నూగారు
న్ను గజకుంభములవంటి స్తనములున్ను తీగెలవంటి బాహువులున్ను శంఖము
వంటికంఠమున్ను నిద్దంపుటద్దమువంటి గడ్డమున్ను దొండపండువంటి యధరమున్ను
మల్లెమొగ్గలవంటి దంతములున్ను చంద్రునివంటి [illegible] ములవంటి క
నుబొమలున్ను ఘనమ్మువంటి కనులున్ను తుమ్మెదలవంటి కురులున్ను కలిగి స్త్రీలలో
కసుందరియైయుండును దాని సౌందర్యము వర్ణింప బ్రహ్మకైన నాశక్యంబుగా
నుండు దానితో ఆపట్టణములోనుండే తలారి వాడున్ను వానికొడుకున్ను యిద్ద
రు స్నేహముచేసి ప్రతిదినమున్ను దానివద్దికి వచ్చుచుండిరి తండ్రి రావడము కొ
డుకును తెలియదు కొడుకు రావడము తండ్రికి తెలియదు యీప్రకారము కొన్ని
దినములు జరిగినమీదట నొకనాడు ముందుగా తలారి వానికొడుకు దానితో మా
ట్లాడుచుండగా తలారి వాడు వచ్చి తలుపు తట్టెను అప్పుడా స్త్రీ తలారి కొడుకు
ను భయపడవద్దని నీవు చరచి గాదెలోదించి కదలక కూర్చుండుమని చెప్పి త
లారికి వాకిలిదెరచి వానితో మాట్లాడుచుండెను ఇంతలో దాని పెనిమిటి వ
చ్చు తెరిగి ఆ గోపిక విటపురుషునకు సంజ్ఞ చేసి గోనా పెనిమిటి వచ్చుచున్నా
డు చెప్పుల చప్పుడు వినవచ్చెను నీవిప్పుడు నామీద కోపము చేస్తున్నట్లు తిట్టుచు
న్నా యిల్లు వెళ్లిపొమ్మని చెప్పెను వాడాప్రకారముగా చేసెను తర్వాత గొ
ల్లబోయెడు యింటికి వచ్చి కోపముతో భార్యను చూచి ఎన్నడున్ను మనయిం
టికి రాని యీ తలారి నేడెందుకు వచ్చి తిట్టుచుంబోయెను కలిగిన మాటని
జముగా చెప్పుమనెను గోపిక చెప్పుచున్నది ఎందునిమిత్తమో తలారివాడు
తనకొడుకును చంపవలెనని తరుముకవచ్చెను వాడు భయపడి పరుగెత్తి
వచ్చి మనయిల్లు దూరి గడగడ వణకుచు నన్ను కాపాడవలెనని నా కాళ్లమీద
పడగా నేను వాణ్ణి యీగాదెలో దాచినాను అంతట తలారి వచ్చి నాకొ
డుకెక్కడ మీ యింటికి వచ్చినాడు చూపించుమనెను నేను చూడనే లేదు వా
డెట్లాపోయెనో యని చెప్పితిని అందుకు వాడు వచ్చి నోటపట్టరాని తిట్లు తిట్టు
చు బోయినాడు నీవున్న యింటివిగదా యింతకోరము చేసినవాడట వానికొ
డుకును జూపి లేవమని మోసమువచ్చునోయని చూపించకపోతిని యిదిగో రా

వీనిం జూచుమని తలారికొడుకును పిలువగా నేవాడు సంతోసముతో సత్వ
రముగా దెలోనుండి వెడలివచ్చి వారియెదుట నిలిచెను అప్పుడు గోపాలుడు వానిం
జూచి సంతోషించి భార్యం గౌగిలించి పిమ్మట నీ ప్రాణములు గాచితివి వీని తండ్రి
కి నీవు అనుపడి లేవానికి వున్న కోపానికి సిద్ధము గాజంపును నీవంటి పరోపకా
రులీ భూలోకంబున లేరని గోపికను జూచి మెచ్చుకొనెను అని ప్రత్యుత్పన్నమ
తి చెప్పగా నీయద్భవిష్యం డయిద లావినుచుండియెమిన్ని చెప్పక యూర
కుండెను తర్వాత అనాగతవిధాతనిండాని వెళ్లుగలపుడు గుకజల ప్రవాహము
నుండా పోయి ప్రవేశించెను సురనాథుసరస్సుదగ్గిరికి జాలరులు వచ్చి వలలు వే
సి ప్రత్యుత్పన్నమతి యద్భవిష్యుడను కొన్ని మత్స్యములతో గూడబట్టుకొ
నిరి అప్పుడు ప్రత్యుత్పన్నమతి తాను చచ్చినట్లుగా వెల్లవెలకంబడి మెదలక
డానుండుటచే నాజాలరులు యిది చచ్చిన చేపయని దానిని విడిచి పెట్టిరి యద్భవి
ష్యుడు యుపాయమేమియు తెలియక తన్నుకొనుచుండగా నిదిమంచి క్రొవ్వి
న చేపయని దానిం బట్టుకపోయిరి తర్వాత ప్రత్యుత్పన్నమతి మెల్లగా జరిగి కొల
నిలో ప్రవేశించును-

అని టిట్టిభస్త్రీ చెప్పగా నేటిట్టిభము దానిమాట సడ్డ సేయకపోయెను పి
మ్మట కొన్ని దినములకు గుడ్లు పెట్టినసముద్రుడు టిట్టిభము యొక్క ప్రతిజ్ఞను భం
గపరచవలెనని యెంచి అలల చేత దాని గుడ్లపహరించెను అప్పు డాయాడతీతు
వు దుఃఖించి తన పెనిమిటినిం జూచి నేను ఆనాడు జెప్పిన మాట వినక పోతివి నే
పెట్టిన గుడ్లన్ని సముద్రము పాలాయెను యిక నేనేమి సేయుదునని పలికి
టిట్టిభంబు భార్యనూరడించి నన్ను పేతగా నివానిగా నెంచవద్దు సముద్రుడ
పహరించిన నీగుడ్లు నీకు దెప్పించి యిచ్చెదనని పలికి పక్షిజాతుల కెల్ల సమాచార
మంపించి పిలిపించి యీసంగతి వారికి దెలియజేసి వారితో గూడి యాలోచ
న సేసి ఆ పక్షులుండా నను గరుత్మంతుని ధ్యానము సేయగా గరుత్మంతుడు ప్ర
త్యక్షమై యిట్లనియె ఓ పక్షిశ్రేష్ఠములారా మీ భక్తికి నేను నిండా మెచ్చి మీరు
న్నచోటికి వచ్చినాను మీరు కోరిన కోరిక గోప్పకొంచమని యోచించక చె
ప్పండి అది సమస్తమైన వారికి నసాధ్యముగా నున్నా నే పని జేయుచున్నాను
మీకంటె నాకు కావలసిన వారెవ్వరని బలికిన గరుత్మంతునితో యీసంగతి తె
లిపిరి తర్వాత గరుత్మంతుడు పక్షిజాతులను పాలసముద్రములో శేషశాయి
యై యున్న విష్ణువుదగ్గిరికి బిలుచుకపోయి ఆసంగతి విష్ణువుతో మనవి చేయగా
భక్తపరాధీనుడైన విష్ణువు గరుడవాహనారూఢుడై సముద్రునిదగ్గిరికి వచ్చి ఓ సము
ద్రుడా నాయందు భక్తిగలయీ పక్షుల గుడ్లనీవపహరించినావని విన్నానుకే

మున నస్వామి మహాత్తరమైన యాపదను బొందియున్నాడు మనమిందుకేమైనా ప్ర
త్యుపకారము వెతుకవలెను సమయము గుర్తెరిగి సంధి సేయ నేర్చిన మంత్రిని శ్మ
సన్నిపాతము వచ్చినప్పుడు త్వరగా దానిం దెలుసుకొని తీర్చిన వైద్యుని సన్ని
సభలో జెప్పకోదగు నుడుత్తరువు డందరున్న తెలిసినవారే రాజు గుణవంతు
డై యున్నా మంత్రి కపటముగలవాడైతే దుష్టములైన మొసళ్లుగల కొలను జే
ర వెరచిన ట్లు ప్రజలు వానిం జేర వెరతురు నీవుని మేలు కోరదు రాజు నొంటరిగా
ని జేసితివి సేవకుల నెవ్వరినిం జేరనియ్యవు అయ్యో మంత్రి రాజు దగ్గిరికి ప్రజల
నెవ్వరినిం జేరనియ్యక నన్నిటికిం దావయై యుండెనా రాజు కుత్తా వేరుగ
వాడగును క్రూరులైన వారికి హితమాచరించు వాడును సాధులకు కీడు సేయు
వాడును జెడిపోవును నీవు సాధువులకు అహితంబు లాచరించు తలంపున ది
ప్రవర్తించుచున్నావు బుద్ధిమంతుడవు గావు మనస్సున వాక్కున నొకరీతిగా
నుండక ఒక కార్యమును ద్దేశించి మిత్రులను సంపాదించుటకు ప్రయత్నము సే
యునతండును ప్రతిదినంబును ప్రసిద్ధములైన పాపంబులాచరించు యధర్మబు సే
యందల చునతండును ఎల్లప్పుడుం బరులకు నుపద్రవము సేసి ధనము గూడ బెట్టని
చ్ఛగలయతండును మిక్కిలి శరీర సౌఖ్యమును పేక్షించి విద్యల నభ్యసించు మ
నస్సుగలయతండును ఎప్పుడుం బరసదనంబుచేత స్త్రీలను జక్కగా వలపించు
నని తలపోయు నతండును వివేకము లేని వారలని నీతిశాస్త్రజ్ఞులు జెప్పుదురు తన
యేలిన వానికి మేలుగోరి అతని ప్రసాదము వల్ల బొందిన సంపదయున్నటికిం జె
డదు తన యేలిన వానికి కీడుగోరి సంపాదించిన సంపద బహుత్వరగా చెడిపోవు
ను నీతిశాస్త్రము జదవనికొలదియు దుష్టబుద్ధులు తాము తెలిసిన వారివలె నెతిలో
చనలు చెప్పవత్తురు తమ అజ్ఞానము తమకు తెలియక శాస్త్రము చదవని వాని
పుత్రుడు మొగలి చెట్టున బుట్టిన పండ్లు ముండ్లు గలిగి యున్నట్టు తండ్రిని బోలిపు
ట్టును నీకుం జెప్ప వలసిన దేమి యున్నది యెవ్వడైతే నేను వంచరాని మాను
వంచబోయి నా ఖడ్గము చేత పర్వతశృంగము దెగ వేయబోయి నా మూర్ఖునికి
బుద్ధి జెప్పబోయినా వానరములకు బుద్ధి చెప్పిన సూచీముఖమను పక్షివలె హా
నిం జెందు ననిన విని దమనకుడక్కథ వినవలతుం జెప్పు మనిన కరటకుం డిట్లనియె.

### శ్రీ కరటకుండు చెప్పిన సూచీముఖమను పక్షికథ. శ్రీ

మంచుకొండకు సమీపభూమి యందొక వనంబుగలదు ఆవనము అనేకఫ
లభరితంబులైన వృక్షములతో నిండియుండును అక్కడ సంచరించుచుండెడు
వానర సమూహంబొక నాడు శీతబాధ చేత మిణుగురు పురుగులను జూచి
అగ్నికణములనుకొని చలిగాచుకొనుచుండగా సూచీముఖంబను నొకపక్షిచూచి

ఓపిచ్చివానరములారా నిప్పులు గావు మిణుగురుపురుగులు అవిగో ఆచెట్టు
జోపు కనిప్పులున్నవి మీరక్కడికి బోయి చలి కాచుకొన్నని చెప్పెను అప్పుడొ
క వానరము ఆ పక్షిం జూచి బహుకోపముతో కన్నులెఱ్ఱజేసుకొని నీ వెవ్వర
వు గిరిగీవిప్పుడిటువంటి మాటలు చెప్పవలసిన పని యేమని ఆ పక్షిని బట్టి రా
తికి వేసి కొట్టి ప్రాణంబులు పోగొట్టెను కాబట్టి బుద్ధిహీనునికి బుద్ధిమంతులు చె
ప్పిన బుద్ధులు యేల హితవగును ఆ సత్యమైన వారి చేతోత్తము సేయదగిన ప్ర
జ్ఞ చేతను గాని బలము చేతను గాని ధనము చేతను గాని తన వంశపువారిని పోషిం
చునట్టి కొడుకు గన్నతల్లి లేతల్లి సౌ దర్యముగల పురుషులు బహు సుందిగలరు గాని
వివేకముగలిగిన పురుషుడు దొరకుట దుర్లభము పలికిన విని దమనకుడు దూర
మున్నంగనుంగొని కరటకుండు వారలనిట్లనియె అన్యులకు అపకారము జేసినవాని
కంఠస్వరము భేదించును ముఖము వివర్ణమౌను చూపులు చలించును దేహము వ
ణకును మరియు నొక్క విశేషంబుగలదు వినుము దుష్టబుద్ధిగలవాడు తనలో
భము చేత జనకతండ్రిని జంపుకొనినట్లు లోభగుణముగలవారు చెడిపోదురని చె
ప్పిన నక్కథ వినగోరెద జెప్పుమనిన కరటకుండిట్లనియె.

## కరటకుండు దమనకునకు చెప్పిన ధనలోభుని కథ,

ఒక పట్టణమునందు దుష్టబుద్ధియును సుబుద్ధియును అను ఇద్దరు కోమటులుగలరు వా
రు చిన్నప్పటినుంచి మిక్కిలి స్నేహము గలిగి యుండిరొక నాడు వారలు ధనము
సంపాదించవలెనని దేశాంతరము బోయిరి అక్కడ సుబుద్ధికి నొకచోట వరాల
బిందె దొరికెను తత్పూర్వము మిక్కిలి స్నేహము వల్ల దుష్టబుద్ధి దగ్గర బోయి ఓ స్నే
హితుడా వరాల బిందె నాకొకటి దొరికెను దీనిని మన ఇంటికి దీసుకొని మన
యిద్దరము బోయి సుఖముగా నుందాము రమ్మని చెప్పెను దానికి అట్లానే కాని
మ్మని దుష్టబుద్ధి సుబుద్ధితో గూడా తన పట్టణమునకు వచ్చి పట్టణ సమీపమునం
దు సుబుద్ధిని జూచి ఓ స్నేహితుడా మన మిప్పుడీ ధనమంతా ఇంటికి దీ కపో
వడము యుక్తము గాదు లోకులు జూచినట్లయితే రాజు వగైరా తెలియజేతురు త
గ్గాత రాజు కొట్టి తీసుకొనును మనము ఈ వనములో నూరు వరాలు వెచ్చమున
కు దీసుకొని కడమ యెక్కడనైనా దాచి పెట్టిపోదామని చెప్పెను అందుకు సు
బుద్ధి సమ్మతించెను తరువాత వారిద్దరు నొక చెట్టు దగ్గరికి బోయి ఆ బిందెలో
నూరు వరాలు దీసుకొని కడమ వరాలక్కడ పాతి పెట్టి తమ యింటికి బోయి మిక్కి
లి స్నేహముకలిగి సుఖముగా నుండిరి ఇట్లా కొన్నాళ్ళు గడచిన పిమ్మట దు
ష్టబుద్ధి ఆ ధనమంతా తానే అపహరించవలెనని యోచించి నొకనాడు రహస్యముగా
బోయి పాతిపెట్టిన బిందె పెళ్లగించి తన యింటికి దీసుకొని వచ్చి దాచుకొని మఱి

కొన్నిదినములకుసుబుద్ధిదగ్గిరబోయిఓస్నేహితుడా నాకుమనము దాచిపె
ట్టినధనమిప్పుడుదెచ్చుకొనకనాలస్యము సేయవలసినదెందుకుయీరాజుము
ద్రికలిధారి కుటుంబమంత్రిబహుభాగ్యుఁడు ప్రజలునిండా సజ్జనులు కట్టిబు
నముమనస్సులోశంకింపఁబనిలేదుధనముమనముదక్కించుకొనవచ్చును పో
దమురమ్మనిసుబుద్ధినిపిలుచుకొనిఆచెట్టుదగ్గిరికిబోయిఅక్కడత్రొవ్వి చూడ
గాధనముగనఁబడకపోయెనుఅప్పుడుదుష్టబుద్ధియేడ్చిరొమ్ముగొట్టుకొనుచుసు
బుద్ధిఁజూచినీవేయీధనమెత్తుకొన్నావనిచెప్పెను నేనేపాపమెరుగనని సు
బుద్ధిపలికెను అంతట వాండ్లిద్దరువివాదపడుచుఆపట్టణపురాజుదగ్గిరికిబోయి
సమాచారమంతాదెలియఁజేసిరిరాజుధర్మాధికారులంబిలిపించియీతగవుదీ
ర్చుండని నియోగించెను వారు వారలఁజూచి అయిదుదినములలోగా మీలోమీ
రుసమ్మతిపడి తేసరే లేనిపక్షమునకు ఆరోదినము మాదగ్గిరికిరావలసినదనిచె
ప్పిరితర్వాతవాండ్లుఆరోదినమునగుపులుతీర్చవారిదగ్గిరికివచ్చినిలిచిరిఅప్పు
డువారుపీడ్లవాజ్మూలములువిని మీకుసాక్షులేవరైనాకలరాఅనియడిగిరి
ఆమాటకుదుష్టబుద్ధియిట్లనియెఓప్రజ్ఞాత్ములారా ఈధనమునిజముగాసుబు
ద్ధియపహరించినాడు ఇందుకుమీకుసంశయింపఁబనిలేదు మేము ఈధనము
మునుచెట్టుకిందపాతిపెట్టినామా చెట్టేసాక్షి నేనా చెట్టు చేతపలికించెద
నుచూడండి నాకల్లనిజంబులప్పుడుమీచిత్తంబులకుం దెలియవచ్చునని పలికెను
ఆమాటలకువారుఆశ్చర్యపడి యొండొరుల మొగంబులు చూచుకొని ఇదివర
కుమేమెన్నఁడుయిట్టిప్రమాణంబువిన్నవారమేకాము నేఁడువింతమాటలువింటి
మిమంచిది నేటిదినముచాలాప్రొద్దుపోయినది రేపుశీఘ్రముగారండిమాట్లా
డుదమని వాండ్లకుసెలవిచ్చియంపించిరిపిమ్మట దుష్టబుద్ధితనయింటికిబోయి
తనతండ్రితోనిట్లనియె.

ఓతండ్రీమనహస్తగతమైనద్రవ్యముపరులకుంబంచిపెట్టనేల. నీవుఒక
మాటచెప్పితేమనకేదక్కుచున్నది నామాటత్రోసివేయకచిత్తగింపుమదేమం
టేఆచెట్టుతొఱ్ఱలోనీవీరాత్రిప్రవేశించి అదృశ్యుఁడవుగానుండి రేపు
ప్రొద్దునధర్మాధిపతులువచ్చిఅక్కడిచెట్టునడుగుదురునీ వాలస్యముచేయక
యీధనమునుసుబుద్ధిగ్రహించెనుగానిదుష్టబుద్ధియెఱుగడని జెప్పుముయీమా
టనీవుజెప్పగానేవ్యాజ్యమునాపక్షముగెలుచునుఆధనముపెట్టుకొనిసుఖ
ముకలకాలముజీవించవచ్చునుఅనినవినిదుష్టబుద్ధితోనతనితండ్రియిట్లనియెచె
డిపోయ్యే కాలమునకునీకిటువంటిబుద్ధిపుట్టినదిధనాపేక్షకుసంతముగలదా ఓ
ముపిచ్చివాడాయుపాయముచింతింపగానేవెంబడిఅపాయమునుగూడా

బుద్ధిమంతుఁడైనవాఁడు చింతింపవలెనుఅట్లా సేయకుంటే కొంగపిల్లలనుముంగీసమింగినవిధమును అనినకథ నాకెరుంగింపుమనిదుష్టబుద్ధియడిగెను అతనికినతనితండ్రియిట్లనియె,

## దుష్టబుద్ధికితండ్రి జెప్పినకొంగపిల్లకథ.

ఒకకొలనిగట్టునదట్టముగానుండెడువృక్షముమీద బకదంపతులువసించియుండిరి వాటిపిల్లను తేపతేపసర్పము భక్షించుచుండెను తర్వాతనొకనాడు ఆడకొంగతనభర్తనుజూచి యిదివరకు నేనుగన్నపిల్లలన్నిటిని పాము భక్షించిపోయెను ఇప్పుడుమూఁడవతిరుగా నాకు ప్రసవసమయమైయున్నది ఈ తేపనయినా ఒకయుపాయమువిచారింపక ఉపేక్షచేసితే పుత్రశోకము నేనెట్లుసహింపగలననికన్నీరుబెట్టుకొనెను అప్పుడు మొగకొంగచెట్టుదిగికొలనిగట్టుననిలిచిరోదించుచున్నసమయంబునఅక్కడికిఒకయెండ్రకాయవచ్చి దానింజూచినీవేలవిచారపడుచున్నావనియడిగెనుతనవృత్తాంతమంతాకొంగదానితో జెప్పెనుఅప్పుడాయెండ్రకాయకొంతసేపు రోదించిఓబకశ్రేష్ఠమా నీకుఒకఉపాయము జెప్పెదవినుముముంగిసయుండేబొక్కదగ్గిరనుంచిపాముపుండేపుట్టదాక అక్కడక్కడనొక్కొక్కచేపనువేసి యుంచుము అనిచెప్పగానాకొంగఆప్రకారముగాచేసెనుపిమ్మటనాముంగిసతనబొక్కలోనుంచిబైలువెళ్లివరసగానున్నచేపలనుభక్షించుచుపుట్టదగ్గిరికివచ్చి అందులోనున్నపామునుభక్షించి వెంబడిగా జెట్టుమీదికినెక్కి కొంగపిల్లనుకూడాభక్షించెనుకాబట్టితనక్షేమముకొఱకుయెంతమాత్రమునుకనికరములేకపరులకుగీడుసేయదలచినవానికిఎన్నటికిన్నిమేలుసమకూడదుఅననితండ్రిమాటలుచెవినిబెట్టకదుష్టబుద్ధిబలాత్కారముగానర్ధరాత్రివేళతండ్రినిబిలుచుకొనిపోయిఆమ్రానితొఱ్ఱలోనిలిపి వేకువజామునలేచితనకులమువారినిపూర్వకొనిధర్మాధికారులంబిలుచుకొనిసుబుద్ధితోకూడాఆమ్రానిదగ్గిరికివచ్చిఆమ్రానికిసాష్టాంగదండప్రణామములుసేసిఓవృక్షశ్రేష్ఠమానీవెరిగినయర్థము నిజముగాబలుకవలెనుఅనిప్రార్థించెనుతరువాతఈధనమునుబుద్ధియపహరించినాఁడుగానిదుష్టబుద్ధియెరుగఁడనివృక్షములోనుండియొక వాక్కువినబడెను ఆవాక్కువిని అందరున్నుఆశ్చర్యపడుచు [illegible] చకనిశ్చేష్టితులైయుండిరిఅప్పుడుసుబుద్ధిచాలావిచారపడిఇదియేమివృక్షముఅసత్యముచెప్పెనుఅనికొంతసేపుచింతించి ఆచెట్టుమీఁదనెక్కికొమ్మకొమ్మశోధింపఁగానొక్కకొమ్మలోతొఱ్ఱకనబడినందునదానిగడ్డిచుట్టినిప్పుముట్టించితానుచెట్టుదిగెనుతర్వాతఅనుం

టబుదేహమునసోకగా నేసహించలేక తల్లడపడి మొరపెట్టుచుదుష్టబుద్ధితం
డ్రిచెట్టుమీదనుండికిందపడెను క్రిందబడగానే ఆశెట్టినిజూచి ధర్మాధికారులం
దరున్ను అతనికిదగ్గిరికివచ్చి యిదియేమనియడుగగా నాకొడుకైనదుష్టబుద్ధి
నాకీయవస్థతెచ్చెనని కలిగినమాటచెప్పి అతడుప్రాణములువిడిచెను అంత
టధర్మాధికారులు ఈసమాచారమంతయు రాజునకుదెలియజేసిరి రాజుదుష్టబు
ద్ధినికొఱ్ఱవేయనాజ్ఞాపించి అతనిసర్వస్వమున్ను దీసుకొనెనని చెప్పికరటకుం
డుమఱియునిట్లనియెనదులుసముద్రములోకలిసెదాకానిలుచును స్నేహ
ము స్త్రీలలోభేదముపుట్టెదాకానిలుచును రహస్యముకొండెగానివినెదా
కానిలుచును వంశముదుష్టపుత్రుడుకలిగెదాకానిలుచునుగాని తర్వాతనిలువ
దనిపెద్దశాస్త్రజ్ఞులుచెప్పుదురు నీవుకులమునుచెరుపతగిన నీచపువాడవడిక గ
లిగియున్నావు నీనడతజూచితే నాకుభయమవుచున్నది చాడీకోరుతనము నె
డబాయకుండినవానితో స్నేహముచేసినవాడు చెడిపోవును పాముపిల్లను
బహుకాలముపెంచినా కఱవకపోవునా తెలిసినవానికి సహవాసముదొరికి
తేనుంచిది అతడుకపటస్వభావముకలవాడైతేనుంచిదిగాదు మూర్ఖుడుదుం
దిగుణముగలవాడైనవానితోసహవాసముకొరగాదు కావున నీవుస్వామినే
యిట్టిదుర్దశనుబొందించితివి ఇకనన్యులకునీకుమిత్రత్వప్రాయమగుటనిశ్చయ
మువొకరికిదాను వంచనచేయవలయునని యోచించితే దైవముదన్ను వంచిం
చును యెంబదిబారువులలోహమునుయెలుకలుభక్షించెనని ఒకవర్తకుండుచె
ప్పితే మఱియొకడుపిల్లకాయనుగద్దతన్నికొనిపోయెనని చెప్పెను విచిత్రమైన
కథవింటివా అని చెప్పగా నేయీకథనాకుజెప్పుమని దమనకుండడిగెను విను
మనికరటకుండిట్లనియె.

—— ❋ కరటకుండుదమనకునకు చెప్పినఅక్షీణవిభునికథ – ❋ ——

ఒకపట్టణములో అక్షీణవిభుడను పేరుగలయొకవైశ్యుడుగలడు అతడుధ
నముసంపాదించవలెనని బేరమాడుటకై పరదేశమునకుబోవుచు యెంబదిబా
రువులలోహముతన స్నేహితునిదగ్గిర భద్రముగాదాచిపెట్టుమని యిచ్చి దే
శాంతరమునకుబోయి యక్కడనుండితిరుగావచ్చి లోహముదాచినస్నేహితుని
యింటికిబోయి ఓయి నాయిన్నిదినములుపరదేశమునకుబోయివుంటిని అచ్చ
టనాకొకచిన్నమైనాలాభముదొరకలేదు ఊరికేనవలసివచ్చెను నీయింట
దాచిపెట్టినలోహమిప్పించవలెను అనియడిగెను అతడుద్రవ్యలోభమున చేతన
తనసొమ్ముతనకీయక దానియెలుకలుదినిపోయెనని చెప్పెను అంతటనావర్తకు
డుకొంతసేపుతనమనస్సులోయోచించి యితడునాసొమ్ముయివ్వజాలక మోస

ముజేయుచున్నాఁడు యితణ్ణి వంచింపకపోతే నా సొమ్ము రానేరదని నిశ్చయిం
చినవాఁడు అతనికొడుకును అయ్యా గంగస్నానము చేయించుకొని వత్తునని తనతోకూ
డా చెఱువుకు పిలుచుకొనిపోయి చెఱువులో స్నానము చేయించుకొని వచ్చేటప్పు
డు ఆచిన్నవాణ్ణి ఒకరియింట్లో దాచిపెట్టి తాను మాత్రము వచ్చెను. నా చిన్న
వాఁడు నీతోకూడా చెఱువుకు వచ్చెను గదా యెక్కడికి పోయినాఁడని వాని తల్లిదండ్రు
లు అడిగిరి. మీ చిన్నవాఁడు నేనుకూడా చెఱువులో స్నానము చేయబోవను వచ్చు
చుండగా మీ చిన్నవాణ్ణి గద్ద తన్నుకపోయెనని వర్తకుఁడు చెప్పెను. అప్పుడు లోహ
మును అపహరించినవాఁడు కన్నులెఱ్ఱజేసుకొని త్వరితముగా రాజుదగ్గరికి పోయి
మొఱపెట్టగా రాజు ధర్మాధికారులను పిలువనంపి ఈ మొఱను విచారించుమని ఉత్త
రువు సేసెను. ఆ వైశ్యుని పిలిచి నీవు మొఱపెట్టుటకు హేతువేమని అడిగిరి. అ
య్యా నా స్నేహితుఁడు శోకనాఁడు నా బిడ్డను తనతోకూడా పిలుచుకొనిపోయి త్రో
వలో వాణ్ణి చంపి పారవేసి బిడ్డను గద్ద తన్నుకపోయెనని చెప్పుచున్నాఁడు. ఇ
టువంటి అన్యాయము భూమియందెక్కడనైనాఁ గలదా? ఇది మీరు బాగా పరి
శీలించవలెనని చెప్పెను. ధర్మాధికారులు నిశ్చయపరచలేక యెన్నఁడున్ను యిటువంటి వి
పరీతము వినలేదు ఇది బాగా విచారించవలసినదని యెంచి ప్రతివాదిని పిలిపించి
సంగతి అడిగిరి. అతఁడు చిల్లని యెనుబది బారువుల లోహము నేను తనయింట దాచిపె
ట్టిపోతిని. అది యెలుకలు తినిపోయెనట. చిన్నబిడ్డను గద్ద తన్నుకపోవుట ఆశ్చర్య
మా అని చెప్పగా సభవారు ఇతఁడు చెప్పిన మాటల తాత్పర్యము తెలుసుకొ
నిరి. యీశెట్టి లోహము నిచ్చునని వర్తకునికిని వాణ్ణి అతనికిచ్చునని జెప్పిరి. తరు
వాత వాండ్లిద్దరు సభవారు తీర్చిన తీర్పుకు సమ్మతించి వారిచోట్లకు పోయిరి. సరి
అని చెప్పి మఱి యిట్లనియె. ఓ పాతకుఁడా! నీకెంత చెప్పితే తెలియును? మూ
ఢా! వాఁడు బుద్ధిమంతుఁడు. నీవు ప్రతివలె శ్రేష్ఠుఁడనై భ్రమించియున్నావు. నీకు
నేమి చెప్పినప్పటికిన్ని ప్రయోజనమేమి? నేను నీతో గూడియుండుట అనుచితము.
నానాదేశములయందు సంచరించుచున్న వాయువునకు సుగంధదుర్గంధములు
గలుగునట్లు దుర్జనసహవాసము చేయుచున్నప్పుడు సుజనునకు దుర్గు
ణములు గలుగును. బుద్ధిమంతుఁడైనవాఁడు చేయఁగూడని కార్యములు చేయవలెనా? ఇప్పు
డు నిండా వప్పిగొనియున్నప్పటికిన్ని చాతకములు వీధిలో బారుచున్న నీళ్లు తా
గునా? అని బహుప్రకారములుగా కరటకుఁడు బలికిన వినక దమనుఁడు సంతసమున స్వామి
సంజీవకుని జంపిన విధము తెలుసుకోవలెను పోదాము రమ్మని కరటకుని బిలుచు
కొని పింగళకుని సమీపమునకు పోయెను. పింగళకుఁడంతటను సంజీవకుని
నిం జంపి పశ్చాత్తాపపడుచుండి దమనకునిం జూచి యిట్లనియె. పాలింపదగిన వా

నిజాదిపాలించిసకలసంపత్తులుగలుగ జేయుటే రాజధర్మముగాని అటువంటి
వానిం జంపుట రాజధర్మము గాదు నేనెంతమాత్రమున్ను ముందు వెనక విచా
రించక యెందుకు సంజీవకుని జంపితిని నాటు బెట్టిన విషవృక్షమునైనా నరికి
వేయుట యుక్తము గాదు మంచిగుణముతో గూడుకొన్నయొక భృత్యుని రాజు
విడిచిపెట్టినట్టయితే కడమవారు తొలగిపోదురు అటువంటి పని చేయడము రా
జునకు హానికరము పరులపాలయిన భూమినైనా దెచ్చుకొవచ్చునుగాని మంచి
భృత్యులను సంపాదించడము ప్రయాసము భూమిలోపల కాలము నాకు ఇది ఒ
క్క అపకీర్తివచ్చెను ఇక నేనేమి చేతును అనిన విని దమనకుం డిట్లనియె స్వామీ శత్రు
సంహారము సేసిన తరువాత ఈ ప్రకారముగా సంతాపించుట యుక్తముగా
దు తన తండ్రినైనా కొడుకునైనా అన్నలనైనా తమ్ములనైనా మిత్రులనైనా తన
నకు ద్రోహము సేసినట్టయితే భూమిమీద ఆశగల రాజు వారిని శీఘ్రముగా వధి
యింపవలసినది అదియునుంగాక యెల్లప్పుడును కోపమయినా దయలేని
రాజున్ను సర్వభక్షకుడయిన బ్రాహ్మణుడున్ను పెనిమిటికి నెల్లకాలము ప్రతి
కూలురాలయిన స్త్రీయున్ను కపటము గలిగిన స్నేహితుడున్ను గర్వించిన భృ
త్యుడున్ను ప్రమత్తుడై యుండెడు మంత్రిన్ని జేసిన మేలుమరచినవాడున్ను
ఈ యేడుగురున్ను బుద్ధిమంతుని చేత విడువబడదగ్గవారు మనుష్యమాత్రులకు
గలిగిన గుణములలో రాజు రాజ్యపరిపాలన సేయవలెనంటే ఆదొరతనము
ప్రకాశించదు శత్రుభయంకరములయిన కార్యముచేత భూతలమంతా తన
వశము చేసుకొని కీర్తి సంపత్తులు గలిగియుంటే దొరతనము ప్రకాసించును యే
ని మనుష్యమాత్రునకు దోషములో అవి రాజునకు మంచిగుణములు ఒకచో
ట సత్యము దప్పకుండా నడుచును ఒకచోట అసత్యములాడును ఒకచోట ప్రి
యవాక్యాలు బలుకును ఒకచోట కఠినముగా మాట్లాడును ఒకచోట నిండా
దయగలిగియుండును ఒకచోట వధించుటకై ప్రయత్నము సేయుచుండు
ను ఒకచోట సంపాదించడమే ముఖ్యప్రయోజనముగా నగుపరుచును ఒకచో
ట నిండా దాతృత్వము కలిగియుండును ఒకచోట వ్యయము చేయుచుండును
ఒకచోట ధనము రాబట్టుచుండును ఈ ప్రకారములుగా ననేకరూపములు గలి
గి భోగముదానివలె రాజనీతి ప్రకాసింపుచుండును ఇటువంటి నీతిమార్గముల
న్ని తెలుసుకొన్నట్టయితే నీకు మిక్కిలి అయిశ్వర్యము గలుగును అని యిట్లు దమ
నకుండు చెప్పగానే పింగళకుడు మనస్సు శోకలత దీరి సంతోషమునొంది తన
మంత్రులతో భృత్యులతో గూడుకొని యెప్పటివలె రాజ్యము సెయుచుండెన
ని విష్ణుశర్మ చెప్పిన మిత్రభేదమనే యీ ప్రథమతంత్రము నా రాచకుమారు

కాలకించిసంతోషభరితులైరి,

మిత్రభేదమను మొదటితంత్రముసంపూర్ణము

---

సుహృల్లాభమను రెండవ.

తంత్రము.

అంతనారాజపుత్రులుసకలనీతిశాస్త్రపారంగతుడగువిష్ణుశర్మకునతిభక్తితోనమస్కరించిఅయ్యా! తమఅనుగ్రహంబువలనమాకుమిత్రభేదమనేతంత్రముసాంగముగాదెలిసెను ఇంకుమవల్లశత్రుమిత్రవర్గములదుఆయాకాలానుసారముగామెలగియుండుటకున్నుసజ్జనమైత్రివల్లగలిగేసుఖమున్నుదుర్జనసహవాసమువల్లగలిగేదుఃఖమున్నుయివి మొదలైనఅనేకకార్యములనుదెలసుకొనుటకు మేముసమర్థులమైతిమిగానఇకమీదదెలియజేయవలసిననీతిశాస్త్రాంశములను ఈతీరునలౌకికదృష్టాంతపురస్సరముగాదెలియజెప్పి యనుగ్రహింపవలెననిమిక్కిలివినీతులై ప్రార్థించిననాతండారాజకొమరులంజూచి ఓయీబుద్ధిమంతులైనవారుసాధనములున్నుధనమున్నులేకఒక్కరినొక్కరుస్నేహముసేసితమకుకావలసినకార్యములనుకాకకూర్మమృగమూషకములవలెనుజక్కగానెరవేర్చుకొందురుఅనివిష్ణుశర్మచెప్పగావారలువినికాకకూర్మమృగమూషకములకువెట్లా స్నేహము గలిగెనుఅవియేకార్యములనెరవేర్చుకొనెనునాకువిశదముగాజెప్పవలయుననవిష్ణుశర్మయిట్లనియె.

మహిళాపురమునుపట్టణమునకుసమీపముగానుండు పెద్దఅడవిలోఒక బూరుగచెట్టుగలదుఆ చెట్టుపైనిలఘుపతనకుడనుపేరుగలవాయసమునివాసముసేయుచుండునుఆచెట్టుకిందికిఒకబోయవాడువచ్చినవానింజూచిఆకాకిభయపడిపీడిక్కడికేమినిమిత్తమువచ్చెనోదుర్జనుడున్నచోటనిలువరాదుఅదియునుంగాక ఇప్పుడునేనాకలిగొనియున్నానుకానాప్రదేశమునుశీఘ్రముగాపోవలెననియత్నబడుచుండగాబోయవాడుచెట్టుచుట్టువలవేసిధాన్యముచల్లితానగుపడకుండాఅవతలిపొదలోదాగిరెప్పవెయ్యకచూచుచుండెనుతర్వాతచిత్రగ్రీవుడనుకపోతరాజువచ్చిఆధాన్యముతినుటకైఆశపడితనపరివారముతోకూడావానివలలోజిక్కబడెనుఆ దిచూచిబోయవాడుసంతోషించివలదగ్గరికివచ్చుచున్నసమయమునందుచిత్రగ్రీవుడుతనపరివారమునుంజూచియిట్లనియెఆకటిబాధచేతనుఓళ్లెరుంగకయునమం

దరమువలలోఁదగులుకొంటిమి మనకీయాపదదొలగించుటకునెవ్వగునా
రునేనొకయుపాయముజెప్పెదవినుండియేకమనస్సునవుండరమున్నఒక్క
ప్రాదిశతోవలయెత్తుకొనిఆకాశమునకునెగసిపోతేయిప్పుడీయాపదదప్పును
అవతలకబోయివలవిడిచుకొనుటకువారియొక్కఉపాయము వెతుకవచ్చునుఅ
నిపలికినకపోతంబులట్లయగుంగాకయనిఅద్భుతంబుగాఆకాశంబునకెగసి
వలదీసుకొనిపోయెనుఅప్పుడుబోయవాడువిస్మయంబునువిషాదంబునుజెం
దితనలోదానిటనివితర్కించెను-లోకములోపక్షులకువలయొడ్డి తెలిపివలలో
నైనాచిక్కుకోవలెను తేకుంటేవలచింపుకొని యైనాపోవలెనుగానియీ
ప్రకారముగావలయెత్తుకొనియెగిరిపోవుటయిదివరకెక్కడనున్నుజూడలే
దుయిదిబహువింతగానున్నదియీపక్షులు నేలను వ్రాలగాజూచిపట్టుకో
వలెననిజూచుచుండెను ఆబూరుగచెట్టుపైనున్నవాయసముయిత్తుచేతబ
డలియుండినా ఈవేడుకజూడవలెనని కపోతంబుల వెనుకపోవుచుండెను-ఈ
లుబ్ధకుడున్నుకపోతములుపోవుదారిభూమిమీదనతిత్వరితముగాబరుగె
త్తెనుఅవిదృష్టిగోచరములుగాకుండాబోయినందునవట్టూర్పులువిడుచుచు
తనయింటికిబోయెనుచిత్రగ్రీవుడున్నుదూరముచనితనయనుచరులంజూచి
నాచెలికాడైనహిరణ్యకుడనెమూషకరాజుయీచేరువనున్నాడు. అత
డునన్నుజూచినట్లైతేయిప్పుడుమనకువచ్చియున్నయీయాపదబోగొట్టునుమ
నమక్కడికిబోదామనిచెప్పెనుకపోతంబులునట్లయగుంగాకయనిహిరణ్యకు
డుండేబిలముమీదికివ్రాలెనుచిత్రగ్రీవుడుతనముఖముచేఎలుకబొక్కలోదూ
ర్చిఓహిరణ్యకా నేనునీచెలికాడనైనచిత్రగ్రీవుడనునాక్షేమమునీవిప్పుడు
విచారించవలెనిపలికినహిరణ్యకుండాపలుకువినిత్వరగాకలుగులోనుంచిబై
టికివచ్చిఆపన్నుడైయున్నచెలికానిమిక్కిలియాదరంబునగౌగలించుకొని
దుఃఖితుడయిఓచెలికాడామంచివివేకముగలనీకున్నిటువంటిదురవస్థవచ్చె
నాఅనిపలికెనుఅందుకుచిత్రగ్రీవుడుచిరునవ్వుతోహిరణ్యకునిజూచియిట్లని
యె,నీవుసమస్తముదెలిసినవాడవైయుండిన్నినన్నడుగుటయేమియెఱిగియుం
డినానీవడిగినందుకుచెప్పుచున్నానువినుముయెవనివల్లనుయేనిమిత్తమునఎప్పు
డుఏప్రకారముఎంతమాత్రముఏస్థలమునందుఏశుభకర్మముగానిఅశుభక
ర్మముగానికావలసియున్నదోఅతనివల్లఆనిమిత్తమునఅప్పుడుఆప్రకారము
గానిఅంతమాత్రముఆస్థలమునందుదైవవశమువల్లమనుష్యులకుఅవుచుండు
నుదైవకృతమైనదానికిమనమేమిచేయగలముఅనిచెప్పగాహిరణ్యకుడునే
మనివిచారించకపలికెనిదినీవుచెప్పినప్రకారమగునుతప్పదుమఱియిట్లుకొ

పక్షులునూరుయోజనములసోడుగునుంచిభూమియందుండేమాంసము
నుకనిపెట్టును కాలముసమీపించినట్టయితే సమీపమందున్నప్పటికైనావల
[illegible] ఝ్లుకనిపెట్టనేరవుయేమిచెప్పవచ్చును యేనుగలకుసర్పములకుపక్షులకు
బంధనమున్ను సూర్యచంద్రులకుగ్రహపీడనమున్ను బుద్ధిమంతులైనవారికిదా
రిద్ర్యమున్ను చేసినవిధినియేమనవచ్చును ఆకాశమునందుసంచరించేపక్షు
లున్ను ఆపదబొందుచున్నవి మిక్కిలిలోతుగలసముద్రములోనుండేమత్స్య
ములున్ను జెస్త చేపట్టబడుచున్నవి ఇందులో న్యాయమేది అన్యాయమేదికా
లుడాసక్తిచేతనుదూరమునుంచి చేతులుసాచి ప్రాణులనుబట్టుకొనుచుండగా
యేస్థానమునందుండేటేనేమి అనిహిరణ్యకుడుపలికిచిత్రగ్రీవుబంధంబులుతే
గగోరకందలంచిదగ్గరికిరాగా చిత్రగ్రీవుడుజూచి ఓ స్నేహితుడా ముందునా
పరివారముయొక్క బంధములు తెగగొరికి తర్వాతనన్ను విడిపించుము వీండ్లను
నేను విడ్డలవలెను బెంచినాను పరివారముయొక్క క్షేమము విచారించనిరా
జునకు రాజ్యమెట్లానిలుచునని పలికెను అందుకు హిరణ్యకుడు చాలాసంతో
షించి ఓ చెలికాడా నీగుణమున్ను నీనడవడిన్ని నీకే తగును నిన్ను స్తోత్రము
సేయనెవరిచేతనవును నీవంటివాడు ఈలోకమునందుగలడా యీలోకమం
తా యేలేటంతశక్తిగలనీవుదని చిత్రగ్రీవునిబొగడి ముందుగా పరిజనులబంధ
ములువదలించితరువాత రాజుబంధమువదలించి అందరికిని దగినట్టువిందుజే
సి చిత్రగ్రీవునిగౌగలించుకొనిపంపించి తానున్న తనస్థానమునకుబోయెను అ
ప్పుడులఘుపతనకుడనే వాయసముచూచి ఆశ్చర్యపడిదగ్గరకివచ్చి ఓ హిరణ్యక
శ్లాఘించతగిననడవడికగలవాడవు నీవేసు నేను నీ స్నేహితుడైన చిత్రగ్రీ
వునిబంధంబులు నీవు విడిపించుట జూచి నీ స్నేహము గోరివచ్చితిని నన్ను మ
న్నింపుము నేను బూరుగచెట్టుమీద సంచరించుచుండు లఘుపతనకుండను
పేరుగలవాడను కాకులనెల్లను సాభృత్యులనుగా జేసుకొని నేను రాజునై
వారిని పాలింపుచుందును అనిన హిరణ్యకుండు విని ఓ వెఱ్ఱివాడా నీకు నాకు నె
ట్లా చెలిమియవును ఎవ్వనికి ఎటువంటివారితో మైత్రి పొసగునో వారు అటు
వంటివారితో మైత్రి చేయవలెను నా శరీరంబు కన్నంబు నీవు భోక్తవు కాబట్టి
మనకిద్దరికిని మైత్రి సరిపడదని చెప్పెను అదివిని లఘుపతనకుడు ఓ చెలికాడా నా
న్నటువంటి పాపాత్మునిగా నెంచవద్దు నిన్ను భక్షించితే నాయాకలి దీరదు నే
నటువంటి పనికి వచ్చేవాడను గాను చిత్రగ్రీవునితో నెట్లా సఖ్యము సేసితివో
ఆటువలెనే నాతో సఖ్యమునకు సమ్మతించుము నాయందు అనుమానము విడి
చి నన్ను జేర్చుకొనుము తిర్యగ్జంతువులకున్న శిష్టులకైన విశ్వాసము నేనిప్పు

డుచూచితిని యిదివరకు నే నెక్కడ చూడలేదు బనీవు బహుదొడ్డగుణములు గలవాడ
వు నీతో స్నేహము వశ్యముగా జేయవలెను దుష్టుడైన వాడు వోర్పు లేక సజ్జను
నికరిహోష్టులు బలికినా అతడు గర్వములేనివాడు గనుక ఆ మాటవల్ల నొక
వికారము బొందడు తృణాగ్ని వేయగా నేసముద్రజలము వెచ్చనవునా అని
అనేక విధములుగా బలికెను నీవు చపలమతివి ఇతరులను గాపాడేశక్తి నీకె
ట్లాకలుగును చపలుడైన వాడు సకల కార్యములు చెరుచును కావున నీకు నాకు
పొందుగా నెరదనిన లఘుపతనకుడు హిరణ్యకుని జూచి యిట్లనియె ఓయీ నా
న్ను కృతఘ్నుడని విరసపుమాటలాడకుము నేను నిన్ను భక్షించుననే శంకవిడి
చిపెట్టి నాతో నవశక్యముగా మిత్రభావము వహింపుము. ఒకానొకప్పుడైన
నాయందు చెడుగుణములు గలుగుననియెంచవద్దని వాయసము చెప్పెను అం
దుకు హిరణ్యకుండిట్లనియె నీవు శత్రుపక్షములో జేరినవాడవు నీకు నాకు మై
త్రి గలుగనేరదు బుద్ధిమంతుడైనవాడు తనశత్రువులను జేరనివ్వడు చేరని
చ్చితే కాగిన నీళ్లచేత నగ్ని చల్లారినట్లు తాను చెడిపోవును శక్యమైన కార్య
ము సేయవచ్చును గాని అశక్యమైన కార్యము యెటువంటి వారయినా
చేయగలరా సముద్రము మీద బండ్లున్ను మెట్ట నేలలను ఓడలున్ను సాగించ
వచ్చునా బుద్ధిమంతులు దుర్జనులతో స్నేహము సేయగోరరు ఇతడు నాకు మి
క్షైలివి హితుడు నావలన సంగా మేలుబొందినవాడు నాకు ద్రోహము చేయడ
నివంచుకొని నమ్మినవాడు చెడును ఇదియథార్థము సజ్జనుడు అనుశబ్దము పూర్వ
కాలమున నుండెను ఇప్పుడు లోకమంతా ధనమూలకమయిన స్నేహము గది
గానున్నది దుర్జనుడు ఇష్టుడైనా ఉపకారము చేసే వానికైనా వాని దుష్టత్వ
భావము వల్ల బడిలోని ద్రించుచున్న పామువలె ఒకానొకప్పుడైనా నమ్మత
గ్గవాడు కాడు బాలా ధనమిచ్చి నా శత్రు నియందున్న తనమీద మనస్సులేని
భాగ్యవంతుడు ... నమ్మికయుంచగూడదు అటువంటి వారియందు నమ్మికయుం
... నును యెంచవలసి పని ఒకసారి దుష్టుడుగా నగుప
డు ... తో నెవడు తిరిగా మైత్రి జేయునో వాడు గర్భము నుధరించిన యెం
డ్ర కాయవలె నాశనము బొందును తాను యితనికి అపకారము జేసినవాడను
గానుగ దా అని దుష్టుని నమ్మియుండగూడదు బుద్ధిమంతులైన వారికి కూడా పు
... దా సంభవించును గనుక దుష్టుని వల్ల భయము కద్దు అని పలికిన వాయసం
బిట్లనియె నీవు చెప్పిన నీతివాక్యములన్ని విని సర్వప్రయత్నముల చేత వే
ను నీతో స్నేహము చెయ్యవలెను నన్ను దుష్టునిగా నెంచినా లేకుంటే నే నాహా
రము మాని దేహము విడుతును కరిగి తేలోహములన్ని యొకటిగా గూడును

నని స్వభావమువల్లనైనా కలుపుకొనును భయమువల్లనైనా లోభమువల్ల
నైనా దుష్టుడు చెలిమి జేయుచున్నమాత్రము చేత సత్పురుషులు స్నేహ
ము చేయరు దుర్జనుని స్నేహము మట్టికుండవలె సులభముగా భేదింపగూడన
దిన్ని తిరిగి అతకగూడదు సజ్జనుని స్నేహము స్వర్ణఘటమువలె భేదింపగూడ
దిన్ని తిరిగి అతకగూడినదిన్ని అని వాయసంబు చెప్పిన హిరణ్యకుండు విని నేను
నీతో నెంతచెప్పినా నీవినకమునకు వశ్యము స్నేహము గావలెనని చెప్పుచున్నావు
నాకునిండా సంతోషమైనది నీమాటను మన్నించితిని తనకు ఒకఉపకా
రము చేసినవాని మిత్రుడనిన్ని అపకారము చేసినందున శత్రువనిన్ని యెంచగూ
డదు ఉపకారాపకారములు మిత్రశత్రువులకు లక్షణములుగావు యెట్లనిన
దోషము గలిగియుండుట శత్రులక్షణములు దోషములేకయుండుట మిత్రలక్ష
ణము అనిపలికె యుక్తవాక్యములచేత నున్న వాయసమున్ను పరస్పర మైత్రిబొం
దెను అటువెనక హిరణ్యకుడు వాయసమును తృప్తిబొందించి పంపి తనగృహా
ము ప్రవేశించెను వాయసమున్ను స్వస్థానమునకుబోయి అప్పుడు అరణ్యము
లో సింహశార్దూలాదులచే జంపబడిన మృగముల మాంసము దెచ్చి హిరణ్య
కునకిచ్చును తానున్ను భక్షింపుచుండెను యిట్లు నిరంతర స్నేహము చేత కొం
త కాలము గడిచెను ఒకనాడు లఘుపతనకుడు హిరణ్యకునిం జూచి యిట్లనియె.

ఓ స్నేహితుడా ఇప్పుడిక్కడ ఆహారము సంపాదించుట కష్టముగాను
న్నది కాబట్టి యింగడ విడిచి యింకొక చోటికి బోవలెననుకొనుచున్నాను
నన్ను పంపుము ఇక్కడికి సమీపముగా దండకారణ్యములో రాజహంస
లు నిండుగనైన పద్మముల చేత ప్రకాశించుచున్న యొకకొలను గలదు అక్కడ
నా చెలికాడైన మిత్రమంథరుడను కూర్మరాజు గలడు అతడు నాకుప్రీతితోచే
పలు మొదలైన ఆహారమిచ్చి నానావిధోపచారములచేత నాదేహము వృద్ధి
బొందించును అని లఘుపతనకుడు చెప్పిన హిరణ్యకుండిట్లనియె ఓమిత్రుడా నేను
నిన్ను బాసి క్షణమైనా నిలువలేను నీవెంటవచ్చెదను నన్ను పిలుచుకొనిపో
మ్ము సంప్రాప్తమైన దుఃఖము దేశాంతరగమనమువల్లగాని శాంతిబొందదు అని
న లఘుపతనకుండు దరిపడి నాతో నిన్నిదినంబులెన్నడున్న చెప్పలేదు దుఃఖప్రా
ప్తికి కారణమేమని అడిగెను అంతా అక్కడ దెలియజేసెదను తెలుసుకొం
దువుగాని నన్ను తోడ్కొనిపొమ్మని హిరణ్యకుండు పలికెను కానిమ్మని వా
యసము హిరణ్యకుని తనముక్కున గఱచుకొని ఆకాశమార్గమున పోయి తా
ను మునుపు పోవలెనని ప్రయత్నపడిన కొలనిదగ్గర బెట్టినిలిచెను ఆసమయమున
మిత్రమంథరుడు కొలనిలోనుంచి బైటికివచ్చి ఎన్నడుం గానిచుట్టము నేడిక్కడి

కివచ్చినంతన నేను కృతఘ్నుడనైతినని సంతోషించి తగిన సత్కారములు శీఘ్రముగా జేసి చెలికానిం జూచి ఓయన్నా ఈమూషక మెక్కడిది దీని నెక్కడికేల దెచ్చితివనియడిగెను వాయసము కూర్మరాజుం జూచి ఓ స్నేహితుడా ఇతడు హిరణ్యకుండను మూషకరాజు నా స్నేహితుడు దైవవశమువల్లనితనికి నొకవ్యసనము సంప్రాప్తమయినది గావున నిన్ను జూడవచ్చినాడు చాతుర్యముగలవాక్కుల చేతనతని దుఃఖము మాన్పుము వెయ్యిముఖములుగల శేషుడును దేవగురువైన బృహస్పతియు నునితని సుగుణంబులెన్న జాలరు స్నేహము నకలకాలము జరుపుటయు కోపము నుత్తమగుణములో విడుచుటయు నిస్సంగునివలె దానము సేయుటయును ఇవి మహాత్ముల గుణములు అనిమరియు చిత్రగ్రీవుని వృత్తాంతము మొదలుగా హిరణ్యకుని గుణములను తనకునతనికి జరిగిన మైత్రినిన్ని సవిస్తరముగా జెప్పి ఇతని నాకంటె శ్రేష్టసఖునిగా గైకొనుమని యాతనిం గూర్మరాజునకు నొప్పగించెను అప్పుడు కూర్మరాజు మిక్కిలి యాశ్చర్యపడి హిరణ్యకునిం జూచి ఓయీ దూరమున విచారించక నిర్జనమైన ఈవనములోకి రావడమునకు కారణ మేమి సవిస్తరముగా జెప్పుమనిన హిరణ్యకుండిట్లనియె.

### ——కూర్మమునకు హిరణ్యకుడు చెప్పిన సన్యాసికథ.——

ఒకపట్టణమునకు వెలపల నొక మఠముగలదు ఆమఠములో చూడాకర్ణుడను సన్యాసి వాసము సేయుచుండును అతడు ప్రతిదినమున్ను బ్రాహ్మణుల యిండ్లకుబోయి భిక్షమెత్తి తెచ్చిన యన్నము మఠములో భుజించి మిగిలిన యన్న మొక పాత్రములో బెట్టి నిద్రించును నేను ఆ అన్నము భక్షించి తృప్తిబొందుచుండును ఇట్లానుండగా నొకనాడు మరియొక సన్యాసి వచ్చి అతనితో నానావిధములైన పుణ్యకథలు మాట్లాడుచుండెను అప్పుడు నేనా యన్నము భక్షింపవలెనని పాత్రదగ్గిరికి బోవగా చూడాకర్ణుడు గిలకల వెదురుకఱ్ఱతో నన్ను వెఱపించి తోలుచువచ్చెను ఆ సమయమున నతడు చూడాకర్ణుం జూచి యిప్పుడు నేనేమి చెప్పితిని నీవేమి వింటివి నీ మనస్సు వేరేపోయినట్టుగానున్నది యెందువలననని యడిగెను చూడాకర్ణుడతనితో నిట్లనియె- నీవు చెప్పుచున్న కథలమీఁద నామనస్సు సావధానంబుగా నుండుట నిజమే అది నీవు తెలుసుకొంటివి అందుకు హేతువు చెప్పుచున్నాను వినుము ఒక యెలుక ప్రతిదినమున్ను నాయన్నము భక్షించిపోవుచున్నది ఇందువల్ల నేనీ మఠము విడిచిపెట్టవలసివచ్చినది నామనసు సావధానముగా నుండుటకు ఇది నిమిత్తము అనిపలికిన నీమఠములో నొక్క మూషకమున్నదా శానా మూషకములున్నవా అని అతండడిగెను శానాలేవు ఇది ఒక్కటే వున్నదని చూడాకర్ణుడు చెప్పిన దానికి నతండిట్లనియె. ఇది

ఒక్కటింహామతముల నుండుటకుప మోహేతువుండవలెను కొండిలీమా
తయనెను స్త్రీసువ్వుల వెల్లసప్పను సరిగానువ్వులడిగితే అందులకారణం
బొక బ్రాహ్మణుడు తెలుసుకొన్నట్లుయూపగనాయుక్కడుఒకటిగానుండు
టకుగారణముసుమనము తెలుసుకొనవలెను అనిపలికిన చూడాకర్ణుడాకథ
నాలగముగా జెప్పుమనిన నతండిట్లనియె.

《 చూడాకర్ణుడునకుస వ్యాసి చెప్పిననువ్వులుకథ 》

తొల్లి నేనొకానొక బ్రాహ్మణునియింటికి భిక్షకొఱకుపోయియుండగా
నాయింటి బ్రాహ్మణుడు భార్యంజూచి రేపటిదినము అమావాస్య బ్రాహ్మణు
లకు భోజనము పెట్టవలసియున్నది యేమియు పదార్థములు మనయింట్లో కూడ
బెట్టియున్నావు చెప్పుమనిన నతని భార్య యిట్లనియె పురుషులు తమసామ
ర్థ్యముచేత పదార్థములు సంపాదించి యింటికి దెచ్చితే స్త్రీలు కావలసినపను
లకు ఉపయోగము జేతురుగాని మీరు తేకపోతే వుండునా అనిన నతడు కోపము
తో భార్యనుంజూచి పదార్థసంగ్రహము విస్తరించి జేయవలెను నేతలంపు వెనువ్వ
రికిని కూడకుముసు పోకనక్క మిక్కిలి కాంక్షచేత పింటి దెబ్బవల్ల జచ్చెనని చె
ప్పిన ఆకథ నాకుం జెప్పుమని భార్యయడిగిన బ్రాహ్మణుడిట్లనియె.

《 భార్యకు బ్రాహ్మణుడు జెప్పిననక్కకథ. 》

అధిష్ఠానపురమునందు మాంసము విక్రయించే బోయవాడొకడుగలడు
వాడు ఒక అడవికి బోయి అక్కడ నొకమృగమును జంపి తీసుకొనివచ్చుచు
మార్గములో కొండవంటి యొక పందిని జూచి దేవుడు నాకు రియొక మాంసము
గలగ జేసెనని సంతోషించి ముసావుతెచ్చుచంపిన మృగమును క్రిందనుంచి విల్లె
క్కుబెట్టి బాణము దొడగి పందిని వేసిన నదియా దెబ్బ తగిలిన కోపముచేత వా
నింబొడిచి చంపి పిమ్మట తానున్ను పడిచచ్చెను అంతట నొకనక్క ఆకలిగొ
ని ఆహారనిమిత్తము అక్కడ తిరుగుచుండి వచ్చియున్న ఆబోయవాణ్ణిన్ని
పందిన్ని మృగమున్ను జూచి మిక్కిలి సంతోషించి మనలో దానిట్లనియె నా
అదృష్టమువలన ఆహారము విస్తారముగా దొరికినది బోయవాడు మృతిబొం
దెను మృగసూకరములుం జచ్చినవి బోయవాని ఒక నెల భక్షింతును పందిని
మృగమును రెండు నెలలు భక్షింతును ఈవింటి నారి నేటికి ఆహారము చేసుకొం
దును అని తలచి మునుపు బోయవాడెక్కు పెట్టిన వింటికొన కొప్పు రొమ్మున
కానించుకొని నారికొరకగా నేవింటికొన విసరు దెబ్బ తగిలి నక్క చచ్చెను
కావున లోభియైన వాడు మీదవచ్చు కీడును తెలుసుకొననేరడు మిక్కిలి కూ
డబెట్టవలెనని తలంపక తగుమాత్రపు వస్తువులు కూడబెట్టకపోతే ఆసంసా

తమముముందరికివచ్చి నాఅసిబ్రాహ్మణునితో నువ్వులున్నవియ్యాము నా
కొంచముకూడబెట్టియున్నాను రేపుపులగముచేయుచున్నానులని చెప్ప
యాతనిభార్య నువ్వులుకడిగిదించియెండబోయగాఒక కుక్కవచ్చి ఆను
వ్వులుకాళ్లతోజల్లెను అవిబ్రాహ్మణుడుజూచి బ్రాహ్మణభోజనానికిఈను
వ్వులుపనికిరావుఇవితీసుకొనిపోయిమార్చితెమ్మని చెప్పెను బ్రాహ్మణస్త్రీ
మరునాడు నేనుభిక్షకోసరముపోయియున్న యింటికివచ్చి నువ్వులపప్పుతీసు
కొనినువ్వులిస్తారాఅనిఆ యింటివారినడిగెను ఆయింటియామె ఈమాట
నికిసంతోషించియింటిలోనుండినువ్వులుదీసుకొనివచ్చి నువ్వులపప్పుదీసు
కొనుచుండేసమయమునఆయింటిబ్రాహ్మణుడువచ్చిభార్యనుజూచినీవేమి
బేరమాడుచున్నావనియడిగెను చేరెడునువ్వులిచ్చిదంచిననువ్వులుమార్చు
కొంటున్నానని పెనిమిటితోనామె చెప్పెను ఓ వెర్రిదానా చేరెడునువ్వులు
తీసుకొనిదంచిననువ్వులిచ్చేవారెక్కడనైనా కలరా యీపెయివ్వడానకు
యేమైనా కారణముకలిగియుండవలెనని పెనిమిటి చెప్పెనుఅంతకుమునుపే
నేను వారియింటికిభిక్షార్థముగాబోయియున్నందునకయీమాటలు నేనువిం
టినియీమూషకమున్న కారణము లేక నేయిక్కడ వాసము సేయదుఅనిఆ
సన్యాసిచెప్పి నవిని చూడాకర్ణుడొకగునపముదీసుకొని నేను వాసము చేయు
చున్నకలుగుతొవ్వి బహుదినములనుంచి నేనుకూడబెట్టియున్న ధనమంతా
తీసుకొనెనుతర్వాత నేనుధనములేనివాడనైనందున సత్వ లేక ఉత్సాహము
తరిగి ఆహారముసంపాదించుకొనుటకుశక్తిలేనివాడనైఆ కలిచేసందా ప్ర
యాసపడుచుతిరుగా బిక్షాపాత్ర కదలింపగా చూడాకర్ణుడునన్నుజూ
చితనధనమంతా తీసుకొన్నప్పటికిన్ని సిగ్గులేక దైనిరుగానాబిక్షాపాత్రయె
క్కాకదలించుచున్నదిఅని పలికిన అంతట నేను మెల్లమెల్లగానతలికిబోతిని
అప్పుడతండిట్లనియెవడు ధనముగలవాడే బలవంతుడు ధనముగలవాడే పండితుడు
ధనములేనందుననీయెలుకతనజాతితోసామ్యమునుబొందెనుదరిద్రుడై బు
ద్ధిహీనుడైనవానికార్యములు వేసంగిని కొంచపునదులింకిపోవునట్లుగాకో
నసాగవుధనముగలవానికేస్నేహితులు దొరుకుదురుధనముగలవానిదగ్గిరి
కేబంధువులువత్తురుధనముగలవాడే మొగవాడు ధనముగలవాడే తెలిసి
న [illegible] చుట్టములులేని దేశముయున్న పుత్రులులేనిగృహమున్న మూర్ఖునిచిత్త
[illegible] శూన్యములుహీనదశ చేతవర్తించేదరిద్రుడుఅంతకంటెసర్వశూన్యు
డు [illegible] గానయింద్రియములున్నఅప్రతిహతమైనబుద్ధిన్నిచతురమైనవా
క్యపద్ధతిన్ని ప్రసిద్ధమైన పేరున్న మనుషటివేళ యినామనుష్యుడు ధన

మనసుగలవానికి నెక్కడికిబోయినా సంపదలుగలిగియుండును గొడుగుగల
వానికిభూమియంతయుగొడుగుచేకప్పబడినదిగానేయుండునుసంతోషమని
యెడునమృతముచేతదృప్తిబొందిశాంతమైనమనస్సుగలవారికి యెటువంటి
సుఖముగలుగునో అటువంటిసుఖముధనలుబ్ధులయినవారలకెట్లు గలుగును
మిక్కిలిధనకాంతగలవానికి నూరామడయినా దూరముగానుండదునిత్య
సంతోషిగానుండువానికిధనముచేతికిదొరికినాదానియందు ఆదరణపుట్టదు
అసాధ్యమైనయర్థమునిమిత్తమైప్రయత్నముసేయరాదు ధనవంతుడువివేకి
అయితేరత్నముతో కాంచనముకూడినట్లు శోభించును భూతదయకంటె పు
ణ్యమున్ను రోగములేకయుండుటకంటే సౌఖ్యమున్ను కపటములేనిప్రీతికం
టే స్నేహమున్ను వివేకియగుటకంటే పాండిత్యమున్ను లేదుఅదినిమిత్తము
గానాకుబుట్టినవిచారమువల్లనీదగ్గిరికివచ్చితిని ఈలోకములోనుండెడు సక
లజంతువులున్ను యెట్లాగైనా ఆహారముకొరకునింద్యమైనకార్యము జేయు
వునీవుపరోపకారార్థము ప్రయాసపడుటతప్పుగాదు ఎవనిప్రయాసపడు
లనిమిత్తముగానుపయోగించునోవాడుఒక్కడేపుణ్యవంతుడు-అనిపలికిన
హిరణ్యకుంజూచిమిత్రమందరుండిట్లనియె - వివేకములేనివాడుశాస్త్రము
లుచదివినావాటిలోజెప్పియున్నప్రకారమునాచరింపడు వివేకముగలవా
డుశాస్త్రముచదివి వాటిలోజెప్పినరీతినాచరించును శాస్త్రములలో జెప్పి
యున్నప్రకారముఆచరించకుంటే అవిచదవడమువ్యర్థము ఔషధము సేవిం
చకఔషధము పేరుచెప్పినమాత్రాననే రోగమునశించునా శాస్త్రములెన్ని
గాచదివినాదానిలో ఇదియిట్లాగనిసిద్ధాంతము జేయుటకు భయపడువాడు
చదివినందున ప్రయోజనములేదు గ్రుడ్డివానిచేతదీపమున్నా అచ్చటిపదార్థ
ము వానికి అగుపడునా యొకవేళ యాచకుండగును యాచకుండొకవేళ
దాతయగును శూరుడొకవేళ శత్రువులనుజయించును ఒకవేళ వోడిపోవును
విద్వాంసుడు ప్రసంగములోనొకవేళ గెలుచును ఒకవేళ వోడిపోవును ఈప్ర
కారముగా హెచ్చుతగ్గులెవ్వరికైనాగలవు అదృష్టముగలవేళ బాగానడు
చును దురదృష్టము వచ్చినవేళ వ్యత్యాసముగానడుచును కాబట్టివీటికన్నిటికి
నదృష్టమే హేతువు దంతములున్ను వెంట్రుకలున్ను గోళ్లున్ను మానవులున్ను
తామున్న నెలవు దప్పితేనిందాదిన్నతనము వచ్చును ఇది తెలిసిబుద్ధిమంతు
లెంతదుర్దశవచ్చినాయితమతమ తావులువిడువరు-

అనిపలికినహిరణ్యకుండిట్లనియెఇదికుత్సితులమాటలు-సత్పురుషసమూ
హమున్ను సింహములున్ను గజములున్ను ఇవిమొదలయినవిమంచియొకచో

టికి-బోయినేన్నదిగానుండును కాకులున్ను కుత్సితపురుషసమూహమున్ను వ్యాగములున్ను ఇవి మొదలయిన వితమనెలవులను విడ వాజాలక అక్కడనే వ్యసనిబోందును మిక్కిలి అల్పులైన వారికే నివాసభూమిని విడుచుటవల్ల నా పదసంభవించును గొప్ప వారికి నాతియేమున్ను లేదు అదియెట్లంటే సింహములు తామున్న చోటు వదిలి వచ్చినట్టయితే రాజుల యొక్క శిరస్సులమీద ధరింపబడును కప్పలు తమచోటు వదిలి వచ్చినప్పుడు కాకులనోళ్లలో బడును ధైర్యశాలియును వివేకియునైన వానికి పరదేశమని గొప్ప భయము ముంచుకైనా లేదు వాడెచ్చట వసియించియుండినా ఆ దేశమే దేశమవును అచ్చట తన భుజబలముచేతను బుద్ధిబలముచేతను సంపాదింపబడ్డ సంపదలను అనుభవింపుచుండును,

అదెట్లనిన సింహము మనుష్యులు తానున్న వనము విడిచి మరియొక వనములో ప్రవేశించినా తన పౌరుషము చేత వజ్రముతో సమానములైన గోళ్లకొనలతో మదించిన యేనుగుల కుంభస్థలములను చీల్చి రక్తము పీల్చి మాంసమును భక్షించి సుఖముగానుండును ఉద్యోగముగల వాడు ధనమున్ను యశస్సున్ను మరణమున్ను పొందును ఉద్యోగము లేని వాడు మరణమును మాత్రమే పొందును ధనము గాని యశస్సు గాని పొందనేరడు కప్పలు అడుసున్ను మీనములు కొలనున్ను పొందినట్టు ఉద్యోగముగల వాడు ధనమున్ను సహాయమున్ను పొందును పాలుమాలికయును స్త్రీలయందభిలాషయును జన్మభూమియందలి యాశయును రోగియగుటయు భయము కోపము అసంతుష్టియు ఇవి ఆరున్ను ప్రాజ్యతకు విఘ్నములు ఈ ఆరు గుణములను పరిహరించిన పురుషుడు ప్రాజ్యుడవును ప్రాజ్యత వలన సంపదలు గలుగును సంపన్నుడైనందున సుఖములను భవించును ప్రాప్తమైనను సుఖమును గాని దుఃఖమును గాని అనుభవింపవలసినది మనము కోరకనే సుఖములు గాని దుఃఖములు గాని వచ్చును సుఖము వచ్చెనని సంతోషపడరాదు దుఃఖము వచ్చెనని చారపడరాదు ఉత్సాహసహితుండును వ్యసనముల యందాశక్తుండును నై తెలివికలిగి పనులయందు ప్రగల్భుడై విసుగులేక స్థిరచిత్తుడయి చిరక్రియుడు గాక సర్వభూతసముండను మిత్రసత్యభావణుండును పుణ్యకర్మముల మీద బుద్ధిగలవాడును ఆశ్రితరక్షకుండును శూరుండును కృతజ్ఞుండునునగు పురుషుని లక్ష్మి తనకుదానే పొందును ఉద్యోగము సేయక పాలుమాలికగలవాడై సాహసము లేని పురుషుని ముసలి పెనిమిటి నివయను భార్యవలెను లక్ష్మి పొందనిచ్చయించదు అని పలికిన సూర్మంబిట్లనియె ఓ హిరణ్యకా నివర్థము లేనివాడవైనను ప్రజ్ఞోత్సాహసహితుండవు గావున నిను గొదవ లేదు బుద్ధిమంతుడొక వేళ ధనము లేనివాడైనా

తే సేగాని అల్పు డుశ్శక్తుడు గాడు బురదలో దిగబడ్డయేనుగను రేనుగుతే
త్తనోపును గాని క్షుద్రమృగములెత్తనోపునా బుద్ధివిభవముగలవాడు వో
కానొకవేళ దైవవశమువల్ల తనకాపదవచ్చినా విద్వాంసులు తన్నుగోనియా
డునట్టుగా ఆయాపదలను ఓర్చుకొనునతని బంధువులు మిత్రులు నాపదబొం
దితనదగ్గిరకి వచ్చితే ధైర్యముతో వారికివచ్చిన యాపదను మాన్పును యెవడు
ధనహీనుడైన మిత్రుని ధనవంతునిగా జేయునో యేమానవుని యాశించిన వా
రును శరణు బొందినవారును తమకోరికెలు నెరవేరి సుఖములుగా పోదురో అ
తడొక్కడే మానవులలో శ్లాఘ్యుడు వాయువు వనంబులను తుమ్మెదలు పుష్ప
లను హంసలు జలములను పక్షులాకాశమును ఆశ్రయించినట్లు మేము నిన్నా
శ్రయించితిమి అని చెప్పగా కూర్మము సంతోషించెను తరువాత మిత్రమందరు
డు లఘుపతనక - హిరణ్యకులతో సంభాషించుచు బ్రొద్దుపుచ్చుచున్న స
మయంబున ఒక మృగము వేటకాని చేత తరుమబడి జెదరి పరుగెత్తుచు అక్క
డికి వచ్చెను దానిం జూచి భయపడి అవి మూలకొకటి పరుగెత్తిపోయెను అం
దులో వాయసము జేరువనొక్క వృక్షంబెక్కి నిక్కి చూచి వేటకాని బాధ తే
కుండుట నెరింగి మిత్రమందర హిరణ్యకులం బేర్కొని మీరు వెరవకుండని పి
లిచిన అయ్యిరువురు నావృక్షంబు చెంతకు వచ్చి భయము చేత గడగడ వణకు
చున్న మృగమును జూచి వారిలో మిత్రమందకుండు యిట్లనియె - ఓ మృగోత్త
మా నీ పేరేమి నీ వెచ్చటనుండి వచ్చితివి యేమి నిమిత్తమువల్ల భయపడితివి -
అత్తట్టున నేమి కార్యము పొసగినది నీవు రావడమువల్ల మాకిద్దలందఱకు వచ్చిన
ట్లున్నది కాబట్టి కావలసిన యాహారమును సంతుష్టిగా బుచ్చుకొని నీ సంచార
ము చేత వనము నలంకరింపుము అని పలికిన నామృగంబిట్లనియె నా పేరు చి
త్రాంగుడు ప్రక వేటకాడు నామీద చలపట్టి అడుగడుగునకు తరమగా భయపడి
యిచ్చట నెవరితోనైనా స్నేహము చేసుకొని నిర్భయముగా నుందామని వచ్చి
తినని నాపలుకులకు మిత్రమందరుండు చాలా సంతోషించి ఓయి చిత్రాంగు
డా ఈ వనములో నీకు మాకంటె చుట్టములు గలుగరు ఈ యిల్లు నీ యిల్లుగా నెం
చుకొని ఖేదము మనస్సున పెట్టక ఇక్కడ మాతోగూడా నుందుము అని చెప్పగా
నామృగము ఆమాటకు సమ్మతించి అక్కడ బహుకాలము సుఖముగా నుండెనం
తట నొక నాడు ఆమృగము మేతకు దూరముగా బోయి ప్రతిదినము వచ్చే వేళకు
రాక పోయినందున కూర్మాదులు చింత జెందికొంత సేపు రేనుగుస్తోచక నుం
డిరి తర్వాత లఘుపతనకుడు లేచి నేను చిత్రాంగుని వెదకి వచ్చెదనని పలికి యెగిరి

పోయిసమీపమున ఉరులలోచిక్కుకొన్నమృగమును జూచికన్నీరువిడుచుచుదుః
ఖసముద్రములోమునిగిఓచిత్రాంగా నీవొకరిని వేడబోవు అన్యులయాప
దకుసమ్మతింపవు ఇతరులసొమ్ము కానపడవు అడవిలో మృదుతృణంబులు భ
క్షించినీరుద్రావి కాలముగడుపుచున్నావొకరికపకారము చేయవు ఇటువంటినీ
కువిధాత ఈలాగంటిదురవస్థసంభవింప జేసెను అనిమఱియు ననేక ప్రకారం
బులనామృగంబును ద్వేశించి దుఃఖించుచుండియున్నంతలోనె ఈవంకకునివెల
దునిమిత్రము వచ్చి ఓప్రియ యేప్రకారముగా జిక్కుబడితివిక మీదమనము చేయ
వలసినదియేమనిపలికిన చిత్రాంగుండిట్లనియె ఓ స్నేహితుడా వేటకాడువచ్చి
న వెనక తన్ను రక్షించుటకు నీకు ప్రయాసము కాబట్టి వాడురాకమునుపునీవు
పోయియీవృత్తాంతమంతా హిరణ్యకునకు దెలియజేసి అతనింబిలుచుకొ
రమ్ము నాబంధంబులతడు విడిపించునని చెప్పిన లఘుపతనకుండా కాశంబున
కెగసిఅతిత్వరితగతిని జనిమిత్రమందరహిరణ్యకులకు చిత్రాంగుడు ఉరిలోబ
డుట తేటపడం జెప్పి హిరణ్యకుంబిలుచుకొనిపోగా నేచిత్రాంగునిజూచి హి
రణ్యకుండిట్లనియె ఓచిత్రాంగా నీవు మహాబుద్ధిమంతుడవు బుద్ధిలేని వానివలె
ఉరులలోతగులుకొంటివి యిదియేమియని చిత్రాంగుడు దుఃఖతో ఓహిర
ణ్యకా లుబ్ధకుడువచ్చిచూడకమునుపే ఈఉరులు తెగగొరికితే మంచిది వాడు
వచ్చినవెనుక నేమిసంభవించునోయనిపలికె నామీదట హిరణ్యకుడువిని నీమే
లుగోరి నీసమీపమునకువచ్చినాను నేనుదగ్గరనుండగా లుబ్ధకునివల్లభయము నీ
కెట్లావచ్చును రానేరదు నేనడిగినది చెప్పుము నేను అయ్యా నేను మునుపొక
సారి మోసపోయియూరులలో చిక్కుకొని దైవవశమువలన బ్రతికియిప్పుడు తిరు
గా బంధంబులందగిలితిని దైవకృతములైన శుభాశుభములను తొలగదోసు
కొనుటకు మనుష్యులమా ఎంతటివారైననుగడిచి బ్రతికితిమనగూడదు పూ
ర్వజన్మమున జేసినవన్నియు ననుభవింపవలసినవిగాని పరిహరింపదగ్గవి కావు దీ
నికిచింతింపబని లేదు నాపూర్వవృత్తాంతము వినుమని చిత్రాంగుండిట్లనియె
పూర్వమున నేనుఆరునెలలశిశువునైయుండగా ఒకనాడు మాజాతిమృగము
లతో కూడా సంచరించుచుండుసమయములో ఒకవేటకాడువచ్చెను అంత
ట నాతో కూడానున్న మృగములంతా జెదరిచెదరిపారిపోయెను నేనునిండా
బలముగలిగియుండనందున వాటితో కూడాపరిగెత్తలేక వెనకజిక్కితిని అప్పుడు
వేటకాడుపరిగెత్తివచ్చినన్నుబట్టుకొని తీగెలతో గట్టిగాగట్టి నెత్తుకపోయి
నక్కృపచేతనన్నుజంపక ఆదేశమేలుచున్నరాజుకొమారునికి కానుకగానిచ్చె
ను అతడు అంతఃపురస్త్రీలుండేచోట నన్నుంచి నామేపునిమ్ము బాగావిచా

రించుచు నట్లు నిట్టము సేసి బహుగా లాలనముగా పెంచుచుండెను ఇట్లు కొంతకాల
ము ఉండగా ఒక నాడు రాత్రి రాజకోమరుడు శయనించియుండు నవసరంబు
న ఉరుములు మెరుపులతో అధికమైన వర్షము కురియుచుండగా నేను ఆతిశయ
త్సాహముతో మనుష్యభాషణంబులని ట్లంటిని వినుము చలుపడిన శరీరము మీద
గాలి తగలగా వేచొక్కళించి దాటుచు పరుగెత్తుచున్న మృగసమూహము వెం
బడి పరుగెత్తే భాగ్యము నాకెన్నడు గలుగునో అని పలుకుచున్న యవసరంబున
రాజకోమరుండా వచనంబు సేయనచ్చటికి వచ్చియున్నాడు గావున ఈ పలు
కులాలకించి దిక్కులు నిరీక్షించి అక్కడ నెవ్వరు లేనందున మిక్కిలి ఆశ్చర్యప
డి నన్నుం జూచి ఈ పక్షే అట్లా పలికెనని నిశ్చయించి రాత్రి మేలుకొనియుండి
సూర్యోదయము కాగానే దైవజ్ఞులను బిలిపించి ఈ వృత్తాంతము వారితో జె
ప్పెను వారిలో నొక ఆచార్యుండిట్లనియె పక్షిజాతులు ఇన్ని మానుష భాషపల
కడము కష్టము అయితే రాజులు ఆ భాష వినగూడదు దీనికి కొన్ని జపములున్ను కొ
న్ని హోమములున్ను సేసి ఈ ఉత్పాతము నివర్తింపసేయవలెను ఇంక దీన్ని
ఇక్కడనుండనీయక అరణ్యములో విడిపించి రావలెను అని చెప్పిన రాజు నన్ను
ఉరచురం జూచి తన సేవకులను బిలిచి ఈ పక్షిని యిప్పుడే తీసుకొనిపోయి అ
డవిలో విడిచి పెట్టిరండి జాగు సేయవద్దని చెప్పెను అంతట వారు రాజాజ్ఞ
చొప్పున నన్ను తీసుకొని వచ్చి ఆడవిలో విడచి పెట్టిరి నా డా ప్రకారమాపద
బొందితిని నేడిట్లు ఉరులలో జిక్కితిని దైవకృతము గడవ నెవ్వనికి శక్యము అ
ని చిత్రాంగుడు చెప్పుచుండగా నింతలో కూర్మరాజు చిత్రాంగాదులు నివాసం
బునకు జేరకుండుట చేత అచ్చట నేమి సంభవించెనో అని చింతాక్రాంతుడై హి
రణ్యకుడు చనిన మార్గమున వెదకుచు వచ్చిన కూర్మమును జూచి హిరణ్యకుండి
ట్లనియె ఓ మిత్రమందగా నీవు మామీది ప్రీతి చేత నిక్కడికి వచ్చితివి మాకిది
యిష్టమే నీ విప్పుడు వేటకాడు వచ్చు వేళ అయినది వారికి దొరకకుండా నే
ము ముగ్గరమున్ను పారిపోగలము నీవు నీళ్లలోనైతే త్వరగా పరుగెత్తగలవు మె
ట్ట నేల నొక అడుగైనా కదలిపోలేవు కావున నీ విచ్చటికి రావడము అనుచి
తము అనిన కూర్మంబిట్లనియె దయాశాలియై నిశ్చల ప్రీతియైన యిష్టజనము
నెప్పుడు చూతునని చూపులు చలింపుచుండు నా మనసు వ్యాకులత నొంది యొక్క
డ నిలువనీయదు మంచి మనస్సు గలిగిన మిత్రుని యందున్ను గుణవంతురాలయిన
భార్యయందున్ను ప్రయాసము నెరిగిన ప్రభువునందున్ను మనస్సు మిక్కిలి అను
రాగము గలిగియుండును తన కేమి కష్టము వచ్చినా అధికముగా తోచదు

అనిపలుకుచున్న సమయంబున నయ్యముని దూరమువలె వేటకాడొక్కడు వచ్చుటజూ
చి హిరణ్యకుడు చిత్రాంగుని నురులు అతిత్వరితముగా దెగగొరికె తానొక బొ
క్కలో దూరెను చిత్రాంగుడు పరుగెత్తెను లఘుపతనకుం డెగిరిపోయెను. అ
వివేకి వేటకాడు నిండావిషాదమును బొందినంతలో మందగతియగు కూర్మ
మును జూచి కొంచెముగా సంతోషించిన మనస్సుగలవాడై దానిం బట్టి వింటి
కొనకొప్పున గట్టుకొని పోవుచుం డెను అప్పుడు వాయసమును మృగమును
మూషకమును కూర్మమునకు వచ్చిన యవస్థ దెలిసి యేమి సేయుటకుం దోచ
క కన్నీరు విడుచుచు వారి వెంబడించి పోవుచుం డెను అందులో హిరణ్యకుండు
తనకు ప్రాణ సఖుడైన కూర్మరాజు వేటగాని చేతం జిక్కు పడిపోవుటకు నిండా
పరితపించి కొంత సేపటికి తెలివి దెచ్చుకొని చిత్రాంగలఘుపతనకులం జూచి యి
ట్లనియె మనము దుఃఖింపం బని లేదు సముద్రము యొక్క అపారమును వలె దుః
ఖము గనలేక యుండునప్పుడు రెండవ దుఃఖము సంప్రాప్తమాయె నది దుఃఖపడు
టరోగమునకు హేతువు కార్యములకు చెరుపు దుఃఖపడుచున్నట్టయితే అనర్థ
ములు మెండుగా వచ్చును కావున మనము చింత మానియుండవలెను తగిన మి
త్రుడు అదృష్టము గలవానికి దొరుకును గాని యదృష్టము లేని వారికి దొరకడు
అటువంటి మిత్రుడు ఆపత్కాలమునందు రక్షించును గాని విడువడు కపటస్వ
భావము గల మిత్రుడు మైత్రిగలవానివలె బైటికి నంటించును అపరాధమే మై
నా వచ్చినప్పుడు విడిచి పెట్టును మిత్రునియందుంచిన నమ్మిక తనతల్లియందును
తండ్రియందును భార్యయందును తోడబుట్టిన వారియందును కొమారునియం
దును హితులయందును పురుషుం డుంచడు పూర్వము తాము చేసు
కొన్న కర్మమువల్ల వచ్చినటువంటిన్ని కాలాంతరములయందు శుభాశుభ ఫ
లముల ననుభవింప జేయునటువంటిన్ని అవస్థాభేదములు ఒక జన్మము పోయి మం
రియొక జన్మము వచ్చినట్లు మానవులకు వచ్చుచుండును దేహమునకు కష్టమున్న
అపాయము సన్నిహితమై యుండును సంపదలు వెంబడిగా నాపదలు వచ్చుచుం
డును కూటమికి తోడనే యడబాయుట సంభవించును ఉత్పత్తి గల సర్వమునకు
న్ను నాశము గలిగె యుండును గాయమైన చోటనే దెబ్బ తగులును ఆహారము లే
నప్పుడే దేహమును జఠరాగ్ని కృశింప జేయును ఆపదలు వచ్చినప్పుడే వైరము
లు పుట్టును దుఃఖము గల్గినప్పుడే అనర్థములు వచ్చును దేహధారులు తోసివేయ
రాదు. ౹౹ శోకంబును శత్రుభయంబును బోగొట్టి రక్షింపజాలి సంతోషమునకు
ను నమ్మికకును స్థానీభూతమై అమృత తుల్యమైన మిత్రమను అక్షరద్వయమును
సృజించిన పుణ్యాత్ముండెవ్వడో తెలియబడకుండనే యడవిదాటి పోకముందే త్వర

గాకున్న స్నేహితుని విడిపించుటకు నుపాయంబు చింతింపవలయునని వీడు యీ యడివిదాటి నాగముగాబోయెనా యెటువంటివారును విడిపింపలేరు అని సె ప్పినచిత్రాంగలఘుపతనకులు హిరణ్యకునకిట్లనిరి ప్రభవించిన యాపదల్లి భయమును దుంచుకొని కానఁ తప్పు కలకబారి సేయవలసిన యుపాయము దెలియ లేక చెలికానిదలంచుకొను మదుఃఖసముద్రములో మునిగియుండుటచేత మాకే మియుఁ దోచదు నీవేమి బుద్ధి చెప్పెదవన్నా వు పాతవున్ను లావున్ను చక్కదనమున్ను బలమున్ను గల దేహము గలిగియుండినా జడబుద్ధియయి రెండుకాళ్ళ జంతువ నై నాకొరగాకు వానిపుట్టువు నిష్ఫలము మాకంటె బుద్ధిచేత నధికుడవు గనుక నిన్ను కోరితిమి యిప్పుడు మేము సేయవలసినకార్యమేమి సెప్పుమని అనిన హిరణ్య కుండు వారలంజూచి నేను నిశ్చయముగా జేయవలసినకార్యమునకు మీరింత గా వే డుకొనవలసినదేమియు నిపలికి ఒక్కింత చింతించి కార్యము నిశ్చయించి యో చిత్రాం గా నీవు వేటకానికి గుపడకుండా ముందుగాబోయి వాడు వచ్చెడు మార్గము లోనొక మడుగుగట్టున చచ్చినదానివలెకదలక పండుకొని కాళ్ళుచాచుకొని కన్ను లుకొంచెముగా మూసుకొనియుండవలసినది ఓలఘుపతనకా ఆచిత్రాంగునిపై కెక్కి కన్నులు పొడుచుచున్న వానివలె మెల్లగా కన్నులబొడుచుచునట్టు ను నుండవలసినది ఇంతలో వేటకాడు వచ్చి మృగము చచ్చిపడియున్నదని యెం చుకొని సంతోషించి మిత్రమందరుని గట్టియున్న పిల్లికూడనుంచి యామడుగుద గ్గిరకి వచ్చునప్పుడు నేను వేటగాని వెంబడిగా వచ్చుచుండి వాడిట్లు క్రింద మించగా నే మిత్రమందరుని గట్టిన కట్లు కొరికి వేతును అంతట మిత్రమందరుండు మడుగులో ప్రవేశించును నేను బొరియలో దూరెదను మీరు పరుగెత్తవల సినదని చెప్పెను అప్పుడు చిత్రాంగలఘుపతనకులు హిరణ్యకుని యుపాయము నకు చాలా సంతోషించి ఆప్రకారము చేసిరి కార్యమంతయు ఆలోచించిన ప్ర కారముగా నెరవేరెను వేటకాడు చింతాక్రాంతుడై వెల్లవెల్లగా తనయింటి కింబోయెను తరువాత కాకకూర్మమృగమూషకములు స్వస్థానమునకుబోయి పూర్వప్రకారముగ నన్యోన్యస్నేహము గలిగియుండిరి అని విష్ణుశర్మ సెప్పెనను హృల్లాభమును విని రాజపుత్రులు ఆనందమును బొందిరి.

సుహృల్లాభమను రెండవతంత్రము ముగిసెను.

సంధివిగ్రహమను మూడవతంత్రము.

శత్రువైన వాడు తనకార్యముకొఱకు మిక్కిలి స్నేహము జేసినాపా

న్న గుడ్లగూబలకున్ను మునుపు వాగ్దోషమువల్ల ప్రబల విరోధము సంభవిం
చినదెట్లనిన ఒకసమయమునందు భూమిలోనుండే పక్షులన్ని తమ్ము రక్షించు
టకొరకు ఒకదొర రాజుగానుండవలెనని ఉలూకశ్రేష్ఠునికి పట్టముగట్టుటకు ప్ర
యత్నము సేయుచుండగా ఒక ముసలికాకిపక్షి సమూహము దగ్గిరికి వచ్చి
మీరు ప్రయత్నము సేసినపని తనకు సమ్మతి లేదని చెప్పి వికారరూపముగలిగిది
వాంధమైన గుడ్లగూబను రాజుగా మీరు సేయవలసిన దేమిగత్తినికిబట్టముగట్టి
నందువలన కేమి కావుదల కాబోవుచున్నది రాజు లేకపోయినా రాజొకడున్నా
డని చెప్పి కార్యము గడుపుకో కూడదా మునుపు చంద్రుడు రాజని చెప్పుకొని కుం
దేలును ఖండించలేదా అని పలికెను అదియెట్లని పక్షులడిగెను కాకి చెప్పుచున్నది.

* ముసలికాకి పక్షిసమూహమునకు చెప్పిన కుందేటి కథ *

పూర్వమొకానొకప్పుడు పన్నెండు సంవత్సరములు అనావృష్టి వ
చ్చినందున నొక యడవియందు గజసమూహములు తమ యూథపతిం జూచి స్వా
మీ మాకేమియు పాయము ఇక్కడ క్షుద్రజంతువులు స్నానపానములకు దగి
న సరస్సున్నది మాకు స్నానపానములకు దగినది కాదు అని చెప్పగా యూథపతి వే
గముగల యేనుగులను ఉదకముగల చోట్లు వెదకి వచ్చుటకై ప్రతిదిక్కునకు నంపిం
చెను అందులో నొకయేనుగు వెతికి వచ్చి అయ్యా ఇక్కడికి సమీపములో స్వ
చ్ఛమైన ఉదకముగల గొప్ప సరస్సున్నదని చెప్పిన యామాట విని గజరాజు ఆయే
నుగులను వెంటబెట్టుకొని మహాసంతోషముతో త్వరగా కొలని దగ్గిరికి నడి
చెను యేనుగులు నడుచునప్పుడు వాటి కాళ్లక్రింద బడి నలిగి శానా కుందేళ్లు చచ్చి
నంజూచి శిలీముఖుడను శశకరాజు తనమంత్రులనందరిని ఆలోచనకు పిలిచి
యెక్కడ నీళ్లు లేనందున యేనుగుల గుంపులు ఇక్కడికి వచ్చి మేఘములవలె విక్కు
లంతయు వ్యాపించినవి వాటి కాళ్లతొక్కిడిచేత శానా కుందేళ్లు నలిగి చచ్చెను
ఈయేనుగుల ఉపద్రవము మానకెట్లు లేకపోవును యేమి సేయుదము అని చె
ప్పగా మిక్కిలి వృద్ధాంతములను సురు తెరిగిన విజయుడను ముసలి కుందేలు శి
లీముఖునిం జూచి అయ్యా యేనుగులిక్కడికి రాకుండా చేయడము ప్రయా
సకాదనెను ఆ మాటలకు శిలీముఖుడు సంతోషించి ఓ విజయా నీతిశాస్త్రము
ను దేశకాలములను సురెరిగిన నీవు యేపనికి బూనినా ఆపని నిశ్చయముగా సి
ద్ధించునని పలికెను విజయుడా మాట విని దేవరవారు ఆజ్ఞాపించినట్టైతే ఇదిగో
కార్యము సాధించుకొని వచ్చెదనని సెలవు తీసుకొని లేచి అవతలికి బోయి
యేనుగులం జూచి నావంటి అల్పదేహులు ఈ యేనుగుల సమీపమునకు బోయి
యెట్లు గా మాట్లాడవచ్చును

స్పృశించుచున్న దానివలె యేనుగు చంపును- ఆఘ్రాణించుచున్న దాని
వలె పాము చంపును-నవ్వుచున్న వానివలె రాజు చంపును - మన్నన సేయుచు
న్న వానివలె దుర్జనుడు చంపును కావున నేను పర్వతము నెక్కి గజరాజుతో మా
ట్లాడెదనని నిశ్చయించి-పర్వతాగ్రమెక్కి గజరాజుం జూచి ఓయిగజరాజా
నీకు శుభమవుగాక అని పల్కెను గజరాజు విజయునిం జూచి నీవెవడవు యెక్క
డనుంచి వచ్చినావు అని యడిగెను నేను మాతను నన్ను భగవంతుడైన చంద్రుడం
పినాడు ఆవిషయం దేల చెప్పెను యేమిపనిగా వచ్చినావని యేనుగడిగెను-ఆమాట
కు కుందేలిట్లనియె-ఆయూథమును దూసుకొని తన్ను జంపవచ్చినాడు మాత భయపడక
యథార్థము చెప్పవలసినది గాన మాతను జంపగూడదు - నేను స్వామి ఆజ్ఞాపిం
చిన ప్రకారముగా జెప్పుచున్నాను నీవు బలమును యెదిరిబలమును లెస్సగా వి
చారించక అజ్ఞానమువల్ల నెవడు శశకముల హానికొరకు ప్రయత్నము సేయుచున్నాడో
వానికి విపత్తువచ్చును చంద్రుడు ఆసరస్సును రక్షించే నిమిత్తము కుందేళ్లను పంపి
నాడు కాబట్టి మమ్ముల బెదరించలేరు-ఆసరస్సు చంద్రునిదైనందున దీనికి చంద్ర
సరస్సని పేరువచ్చినది శశకములనగా కుందేళ్లు వాటినిగలవాడుగాబట్టి చంద్రు
నకు శశియను పేరువచ్చినది మేము చంద్రునికి బిడ్డలము మమ్ములమీరు నలగ
ద్రొక్కి చంపినారు-ఆ సమాచారము విని చంద్రునికి కోపము వచ్చి మీకు ఏలి
ప్రకారమెందుకు చేసెనో తెలుసుకరమ్మని నన్నంపినాడని చెప్పగా నేనుగు
భయపడి అయ్యా అజ్ఞానమువల్ల జేసితిమి మేము పోవుచున్నాము కోపము చే
యవద్దని వేడుకొనెను మారాజైన చంద్రునితో జెప్పి సెలవు దీసుకొని పొండి
యూ పోయెడు కాలమున ఈ చంద్రుడిక్కడికి వచ్చునని కుందేలు చెప్పగా యేనుగు స
మ్మతించియుండెను తరువాత ప్రొద్దు క్రుంకగానే చెవులపోతు గజరాజును చం
ద్రుని కొలువు చేయ సరస్సు నీకొలని దగ్గిరికి బిలుచుకొని పోయి కొలనిలో చంద్ర ప్రతి
బింబమును జూపించెను మా అపరాధము సహింపవలెను అజ్ఞానమువల్ల జేసినా
రము ఇకమీద నీదిక్కున రాము అని గజరాజు చంద్ర ప్రతిబింబమునకు మ్రొక్కె
ను అంతట చెవులపోతు గజరాజును చూచి చంద్రుడు దయతో నిన్ను విడిచిపెట్టి
నాడు నీమనస్సు వచ్చిన చోటికి శీఘ్రముగా పొమ్మని చెప్పెను గజసమూహము
లతో కూడా గజనాథుడు బహు వేగముతో మరియొక చోటికి బోయెను తర్వా
త విజయుడు శిలీముఖుని దగ్గిరికి వచ్చి అతని పాదములకు మ్రొక్కి దేవా ఒక ఉపాయ
ము చేత యేనుగులు ఈకొలను విడిచి పొయ్యేటట్టు చేసి వచ్చితిని ఇక మనమీ చో
టు విడువక సుఖముగా నుండవచ్చునని ఆవృత్తాంతమంతా చెప్పెను శిలీ
ముఖుడు విజయుని కౌగలించుకొని బహువిధంబుల ప్రశంసించి సుఖముగానుం

సమీపముననున్న వస్తువుకంటెకి నగపడును నాకు యుమువలెను ఇంద్రియ
పటుత్వము లేమనిండా వృద్ధుడనై తిననిదధికరుణుడవలెకాగా వారు కొంచెము
దగ్గిరికివచ్చిరి అప్పుడు మార్జాలము వాటికిరిండా నమ్మికపుట్టునట్లుగా నిట్లనియె
ధర్మము జెరిచితే తన్ను జెరుచును ధర్మము రక్షించితే తన్ను రక్షించును.

కాబట్టి ధర్మమును జెడగొట్టరాదు మరణకాలమునందు దోడుగా వచ్చు
నది ధర్మమొక్కటే కాని యితరమైన ధనము మొదలైన వస్తువులలో నొకటైనా
తనతో గూడ రాసేరదు నేను చెప్పేమాట సత్యము నేను కల్లలాడేవాడను కాను
కల్లలాడేటువంటి వాడు నరకములో బడును సందేహము లేదు అహింసకు స
మానమైన ధర్మము లేదు పరభార్యలను తల్లివలెను పరద్రవ్యములను మట్టిపెంట
వలెను సర్వభూతములను దనవలెను యెవడు చూచునో వాడు పరబ్రహ్మమును
దెలుసుకొనును భయపడి తన్ను శరణుజొచ్చిన వాని రక్షించితే అశ్వమేధ
యాగము చేసిన ఫలము వచ్చును ఈప్రకారముగా మార్జాలము చెప్పగా
శశకపింజలములు నమ్మి మిక్కిలి సమీపమునకు వచ్చిరి రాగా నేపిల్లి ఆ రెంటి
నొక్కసారిగా బట్టి కాళ్ళతో నదిమి చంపెను గనుక అల్పుని ప్రభువుగా సేవిం
చి శశకపింజలములు వ్యాప్తి బొందినట్లు మనము ఆపద బొందుదుము గావున వీడు
అల్పుడు రాజ్యార్హుడు గాడని ముసలి కాకి చెప్పెను అంత పక్షులన్నియు ఈ
కాకి నిజము చెప్పెనని ఉలూకమునకు రాజ్యాభిషేకము సేయక తమతమ నెలవుల
కు బోయెను తరువాత ఉలూకపతి వృద్ధవాయసము దగ్గిరికి వచ్చి రోషము చేత క
న్నులు నిప్పులొలుకుచు ఓ వృద్ధవాయసమా నేను నీకేమి అపకారము చేసితిని
నీ వెందుకు నా రాజ్యమునకు విఘాతము చేసితివి తీక్ష్ణమైన బాణము చేదగిలిన
గాయము మానును గొడ్డంటనరకబడ్డకొమ్మ చిగిరించును కార్చిచ్చు కాలినచేమా
డినవ్రణము నిత్యముగా మొలుచును నిష్ఠురోక్తులచేత కొట్టబడ్డహృదయము ఎన్న
టికిని మానదు కాబట్టి యిక మీదు మీకును మాకును వైరము సిద్ధమని చెప్పి తన నె
లవుకు బోయెను అని కారణంబుగా ఉలూకంబులకును మాకును వైరము సహ
జమై ప్రవర్తిల్లెను అని చిరంజీవి చెప్పినవిని మేఘవర్ణుండు అయ్యా మనమిప్పు
డు సేయవలసిన యుపాయమేమో సాయంకాలానకు ముందుగా సెలవిచ్చిం
పవలసినదని చిరంజీవితో జెప్పిన చిరంజీవి యిట్లనియె స్వామీ సంధివిగ్రహములు
సేయనిప్పుడు సహాయము కాదు యానాసనద్వైధంబులుం గూడ సమాశ్రయ
మొకటి యుక్తంబు అది యేవిధముగానైనా సేయుచున్నా మన శత్రువులు బల
వంతులై అనేకులుండినా బుద్ధిబలముచేత వంచింపవచ్చును మును బ్రాహ్మణు
లు ఒక వంచకుని చేత వంచింపబడలేదా అని పలికిన మేఘవర్ణుండు ఆ కథ యెట్లని
యడిగెను చిరంజీవి యిట్లనియె

——*మేఘవర్ణునకు సంజీవకుఁడు చెప్పిన వంచకుల కథ.*——

తొలి కొందరు బ్రాహ్మణులు యాగార్థముగా నొక మేకపోతును తీసుక
పోవుచుండగా మార్గములో నొక వంచకుఁడు చూచి ఆ మేకపోతును వీరు విడిచి
పోవునట్లు త్రాలోచించి వారిదగ్గిరికి వచ్చి అయ్యా మీరు దొడ్డవారు కుక్కను మో
సుకపోవుచున్నా రేమని యడిగెను ఛీ నీ కేమి తెలుసు పొమ్మని వాని మాట ని
రాకరించి బ్రాహ్మణులు పోవుచుండిరి తర్వాత మఱికొంత సేపటికి మఱియొ
క వేషము వేసుకొని వచ్చి అయ్యా మిమ్ముఁ జూచితే బ్రాహ్మణులుగా నున్నా
రు యీ పెద్దకుక్క నెందుకు మోసుకపోవుచున్నా రనెను నీకు తెలివి లేదు పొ
మ్మని వాని మాటలత్రోసి పెట్టి బ్రాహ్మణులు మఱికొంత దూరము పోయిరి పి
మ్మట కొంత సేపటికి వాఁ డింకొక వేషము వేసుకొని వచ్చి ఓ బ్రాహ్మణోత్తములా
రా మీరీ కుక్కను మోయుట మేమి మీకీ యవస్థ యెవరు తెచ్చి పెట్టి రనెను ఆ
వెంటనే బ్రాహ్మణు లామాట విని కొంచము అనుమానించి ఇందఱి వాక్యము
గా నిది కుక్కయని యెంతమాత్రము సందేహించకుండా చెప్పుచున్నారు గను
క అబద్ధముగా నుండదు మన బుద్ధికి భ్రమ పుట్టినదని నిశ్చయించుకొని యా మే
కపోతును విడిచి పెట్టి పోయిరి తర్వాత ఆ మోసగాఁడు మేకపోతు నెత్తుకొని పో
యెను కాబట్టి శత్రువుల సేవలు బుద్ధిమంతులై యుండినా వంచించవచ్చు నని నే
ను నుపాయముతో శత్రువులను జయించెదను నా మాట నమ్మి చింత విడిచి నా దే
హమునకు నెత్తురు పూసి మీరందరు ఋష్యశృంగ పర్వతమునకు బోయి
యుండవలసినది నేనిచ్చట నుండి మనకు వచ్చిన యాపద దప్పించు కొరకు ప్రయ
త్నము జేయుచుండెదనని చెప్పిన మేఘవర్ణుఁ డా ప్రకారముగా జేసెను తర్వా
త సూర్యాస్తమయము కాగానే యా రాజు తన మంత్రులం జూచి శత్రువులను
నిశ్శేషముగా జంపవలసినది ఒకటి శేషించినా మనకు హాని చేయక మానఁడు అగ్ని శేష
ము ఋణశేషము శత్రుశేషము లుంచఁగూడదు కావున మనము త్వరగా ఆ మఱ్ఱి
చెట్టు దగ్గిరికి బోయి కాకులను వెదకి చంపవలెనని పలికెను మంత్రులా మాటవి
ని దేవర వారు చెప్పినది మహోత్తమముగా నున్నదని ఉపమర్దుని శ్లాఘించి ఆ
తనితోఁ గూడుకొని కాకనివాసంబగు మఱ్ఱి దగ్గిరికి బోయి అక్కడ నొక కాకి యైనా
గానక కాకులన్ని చచ్చెనని తిరుగ వచ్చు సమయమున చిరంజీవి మూల్గెను ఆ కూఁ
త విని గుడ్లగూబలు పోయి చిరంజీవిని బట్టుకొని వచ్చి ఉపమర్దుని దగ్గిర నుంచిరి ఉ
పమర్దుఁ డతనిం జూచి నీ వెవఁడవని యడిగెను నేను చిరంజీవి యను వాఁడనని చె
ప్పెను నీవు మేఘవర్ణునికి ప్రధానమంత్రివి గావా నీకీ యవస్థ యెట్లు వచ్చె
నని యుపమర్దుఁ డడిగెను అయ్యా నన్నాలోచన యడిగితే డీప సమర్థుఁడు బలవంతుఁడు

గనక నతని శరణుజొచ్చి బ్రతుకుదమని చెప్పె నందున వీరు శత్రుపక్షపాతియై
పిశాచులన్నియుం గూడి నన్ను ముక్కలుబొడిచి కాళ్లందన్ని యిట్లాచేసిరి ప్రా
ణములుపోలేదు మీరైనా బాగా చంపండి అని చిరంజీవి చెప్పగా నుపమర్దుడు విని
రక్తాక్షుడు మొదలగు తనమంత్రులం జూచి వీని నేమి సేయుదమనిన నందులో
రక్తాక్షుండిట్లనియె యొకశత్రువు హీనబలుడై యున్నప్పుడు దొరికితే అవశ్యము చంప
వలసినది దయచేత వానిరక్షించినట్టయితే మీదటికి వాడే ప్రబలశత్రువగును
కాబట్టి వీని నిప్పుడు చంపుదము అని చెప్పిన క్రూరాక్షుండిట్లనియె శరణుజొచ్చి
న వానిజంపితే పాపమని ధర్మశాస్త్రమునందు జెప్పబడియున్నది కాబట్టి దయ
చేత వీని రక్షింపవలెను అనిన దీప్తాక్షుండనుమంత్రిం జూచి నీకు దోచినమాట సెప్పు
మనిన దీప్తాక్షుండు అయ్యా శరణాగతుని జంపుటయిది వరకు నేనెక్కడా విన
లేదు మునుపొక కపోతము శరణుజొచ్చిన బోయవానికి స్వశరీరమాంసమిచ్చె
ను తొల్లి యొక వైశ్యునికిని చోరునికిని జరిగిన వాద మొకటి గలదు అది చెప్పెద విన్ను
మనిట్లనియె

*ఉపమర్దునికి దీప్తాక్షుడు చెప్పిన వైశ్యుని కథ*

ఒక పట్టణములో నొక వైశ్యుడు గలడు అతనికి చంద్రరేఖయను భార్య
గలదు అది సౌందర్యము గలది - పెనిమిటి ముసలివాడైనందున వానినాలింగనము
సేయ కానదు - వానితో మాట్లాడదు వానిదిక్కు చూడదు ఇట్లుండగా నొకనాడు
వానియింటికి నిశీథవేళ నొకదొంగవచ్చి కన్నము వేసి లోగా దూరి నిద్రించుచు
న్న చంద్రరేఖం జూచి దేదీప్యమానములైన దాని సొమ్ములపహరింపదలచి దా
ని జేతులమీదదన చెయ్యివెయ్యగానే అది మేల్కొని దొంగనుజూచి భయప
డి పెనిమిటి తట్టిమళ్ళి కౌగలించుకొని మెల్లగా పిలిచి లేపెను పెనిమిటి మేల్కొ
నియిది యేమి ఆశ్చర్యము రొమ్మన్నదు నన్ను కౌగలించుకొనదు నాతో మాట్లాడదు
నాతట్టు మళ్లదు నేడతత్వరగా నన్ను కౌగలించుకొనెను - నాతట్టు మళ్లను నన్ను
పిలచెను దీనికి హేతువేమని ఆలోచన సేయుచుండగా చంద్రరేఖ దొంగను
దన చేతతో జూపించెను అప్పుడు దొంగను జూచి నిండా సంతోషించి ఓ పుణ్యా
త్ముడా నీవు నాకెన్నడు లభింపని సుఖము కలుగజేసినావు నీకు నేనేమి ప్రత్యుప
కారము సేయగలను యిదిగో నాయింటగల ధనం బెల్ల నిచ్చెద దీసుకొనిపొమ్మ
ని పెట్టెల తాళములు దీసి తన ధనమంతయు కిందగుమ్మరించెను అప్పుడా దొంగ
యాతని మృదుభాషణములకు సంతోషించి దయగలవాడై అయ్యా నాకేమియుం
బనిలేదు ఇక మీదనీ భార్య నీ మనసు ప్రకారము నడుచుకొనును సంతోషపె
ట్టుక పో తెనవుతలి చిన్నప్పుడు నేను వచ్చి దీనింజంపి భక్షింతును అని చెప్పి వాని ధన

ముకొంచెమైనాతీసుకొనకపోయెను దొంగిలించడమే జీవనముగాబట్టినచో
రుడున్నమంచిమాటలుమాట్లాడిన వైశ్యునకునుపకారముచేసిపోయెను-కాబ
ట్టిశునకమునీ వాయసంబునుశయజ్ఞాత్తవలయునని యనినవిని వక్రనాసుండనుమం
త్రిం జూచినీవేమి జెప్పుచున్నావనియడుగగా-ఈకాకిని జంపగూడదుశత్రువు
లుతమలో దాము విరోధపడుటమంచిది - తొల్లిచోరుండును రాక్షసుండునువి
రోధపడి బ్రాహ్మణునికిచోరుడు ప్రాణములిచ్చెను రాక్షసుడు రెండావుల
నిచ్చెను అదివినుము నివక్రనాసుండిట్లనియె.

*వక్రనాసుండు సెప్పిన బ్రహ్మరాక్షసుని కథ

ఒకయగ్రహారములోనొక బ్రాహ్మణుండుకలడు అతడు మంచిపాడ
డిగలవాడు అతనికిమంచియావులు రెండుగలవు ఆయావులనపహరించవలెనని
యొక దొంగబహుదినములనుంచికనిపెట్టుకొనియుండె ఒకనాడు రాత్రి రెం
డుఝాముల వేళమబ్బుబట్టిసన్న చినుకులు రాలగాదట్టమైనచీకటిలోనొంటి
గాబోవుచునొకని చెయ్యితనదేహముదాకగా నే బెదరకన్నిడెవ్వడనియడిగె
నునేబ్రహ్మరాక్షసుడనియతడుచెప్పి నీవెవడవనిదొంగనడిగెను నేనుదొంగన
నిచెప్పెను-నీవెక్కడికిబోవుచున్నావనిరాక్షసుండడిగెను బ్రాహ్మణునియా
వులనపహరింపబోవుచున్నా వనిదొంగచెప్పెను నేనాబ్రాహ్మణునిబట్ట
బోవుచున్నానని రాక్షసుడుపలికెను తర్వాత వారిద్దరు బ్రాహ్మణునింటి
కిబోయి వాకిటనిలిచిరి-అప్పుడా రాక్షసుడుచోరునింజూచి నేనుముందుగా బ్రా
హ్మణునిబట్టుచున్నాను తరువాత నీవు ఆవులను దోలుకపొమ్మని చె
ప్పెను అందుకు దొంగ నీవు ముందుగా బ్రాహ్మణునిబట్టితే బ్రాహ్మ
ణుడు లేచి కేకలు వేసినయిరుగుపొరుగువారు లేతురు-ఆ సమయములో నేను
పరిగెత్తిపోవలసినదే కాని ఆవుల నెట్లుతోలుకపోగూడదు నేనుముందుగా ఆవుల
దోలుకొనియూ గ్రామము దాటి పోగా నీవు బ్రాహ్మణుని బట్టవచ్చునని
రాక్షసునితో జెప్పెను అందుకు రాక్షసుడు ఒప్పుకొనక ఇద్దరున్ను ఆగ్రహము
చేత దేహములు తెలియక పోట్లాడుచుండిరి అసందడివిని బ్రాహ్మణుడు మేల్కొ
ని తలవాకిటవచ్చి ఈనిశీధ వేళ మా వాకిటజగడమాడుచున్నారు మీరెవరనియ
డిగెను-వీడునిన్నుబట్టవచ్చిన బ్రహ్మరాక్షసుడనిచోరుడు చెప్పె ను వీడు నీయా
వులనపహరించవచ్చినదొంగయని బ్రహ్మరాక్షసుడు చెప్పెను బ్రాహ్మణుడుత
నమంత్రబలముచేత బ్రహ్మరాక్షసునిబారద్రోలెను అంతకుమును పే దొంగ
పరుగెత్తిపోయెను కాబట్టిశత్రువులుతమలో దాముపోరుటమేలు ఆవియునుం
గాకమహాత్ముడైనశిబిచక్రవర్తితనమాంసమునుగోసి డేగకిచ్చిశరణుజొచ్చి

సకపోతమును రక్షించినాడని చెప్పగా వినలేదా నీవు శరణాగతుని జంపగూడదు
అని వినియు సమర్థుడు ప్రాకారస్థుండను మంత్రిం జూచి నీ తాత్పర్య
మేమియని యడిగిన నతండు వక్రనాసుడు సెప్పినట్లే సెప్పెను అంతట రక్తా
క్షుడు లేచి మ్రొక్కి యు పమదానునికిట్లనియె పగవాడు దీనుడై హీనవృత్తి
చేత నణగియుండి సపుబలము గలిగినప్పుడు విజృంభించును తనకు గీడు సేసిన టు
వంటి దుష్టుని చేత జెప్పబడిన వినయవాక్యముల వెమెచ్చుకొను వెఱ్ఱివాడు గల
డా యీ చిరంజీవి మనుపు ప్రత్యక్షముగా నీకపకారము సేసిన వాడు యిప్పుడు
మంచిమాటలాడగా నెవీనిని నమ్మగూడదు మూఢుడు మంచిమాటల చేత సంతో
షించును తొల్లి అవివేకియైన రథకారుడు ప్రీతి చేత తన భార్యను జారునితో గూ
డా నెత్తిన బెట్టుకొని మోయలేదా ఆ కథ విధమనగా రక్తాక్షుండిట్లనియె

## *రక్తాక్షుడు మేఘవర్ణునకు చెప్పిన రథకారుని కథ*

ఒకపట్టణములో నొక రథకారుడు గలడు వాని భార్య పద్మముఖి యను పేరుగల
ది అవివర పురుషుల సహవాసము గలిగియుండెను ఆ జాడ వానికి దెలిసి కనిపె
ట్టవలెనని యెంచి యొకనాడు భార్యను జూచి ఓ ప్రియా నాలా రాజు నన్నొక
చోటికి రహస్యముగా బోయి రమ్మని చెప్పినాడు నాకు నిన్ను విడిచిపోవుటకు మ
నస్సు లేదు భృత్యుడు పోలేనని మరుగై యుండగూడదు నే నెంతకు రాజు కొలు
వులో మరుకొంటిని యిప్పుడిటువంటి యవస్థ వచ్చెను అని చింతాక్రాంతుడై
న వానివలె నుండగా వాని భార్య పెనిమిటిని జూచి ఓ ప్రాణనాథా నభృత్యు
లలో నీవు శ్రేష్ఠుడవని రాజు నిన్ను బిలిచి యొక పనికి బోయి రమ్మని ప్రీతిగా జె
ప్పినప్పుడు పోకపోతే బాగుండదు చెప్పిన పని చక్కబెట్టుకొని వచ్చినట్టయితే
రాజు దయ చేత సుఖపడవచ్చును కాబట్టి నీవు పోయి రావడమే యుక్తమని చె
ప్పి యతని మజ్జన భోజనాదుల చేత దృప్తిం బొందించి తాంబూలంబిచ్చి మరి
యుం జేయవలయు నుపచారంబులు సేసి దోవకు గావలసిన వస్తువులు మూట
గట్టియిచ్చి ప్రొద్దుగూకక మును పే పెనిమిటిని బంపించెను వాడిల్లు బైలు వెళ్లిపో
గానే ఆ స్త్రీ తన యుపపతిని సరమ్మని చెప్పి దూతను పంపె స్నానము సేయబోను అ
ప్పుడు ఆ వానిమగడు ఊరికి బోక తిరుగా వచ్చి భార్యకు దెలియక లోగా బ్రవేశిం
చి మంచము కింద దాగియుండెను ఆ పద్మముఖి స్నానము సేసి నాణ్యమైన వస్త్ర
ము గట్టి మంచి గంధము బూసి తలదువ్వి కొప్పు పెట్టి పువ్వులు ముడుచుకొని సొమ్ము
లు ధరియించి తాను చేసిన యలంకారము బాగున్నదో లేదో అని అద్దములో వెలుతు
రున నద్దము వెట్టి చూచి సంతోషించి యుపపతి రాకెదురు చూచుచుండెను ఆ
సమయమున జారుడు చక్కగా నలంకరించుకొని పద్మముఖి యింటికి వచ్చి దా
నిం జూచి నీ మొగడెప్పుడూరికి బోవునో నన్నిప్పుడు పిలువనంపి గౌరవింతువో అ

నీ అవకాశములు నిరీక్షించుచుంటినని నన్నిప్పుడు రమ్మని పిలిపించినందున నేను ధ
న్యుడనైతినని కొన్ని ప్రియవచనములు పలికి దాని నాలింగనము సేయఁగా నేను
అంతట నా పద్మముఖి దాని మన్నన జేసి మంచముమీఁద గూర్చుండ బెట్టి తా
ను గూర్చుండియుండునపుడు తన కాలు పెనిమిటికిం దాకెను తాకగానే ఈ
మంచముకిందనుండేవాఁడు పెనిమిటి గాని మఱియొకఁడు కాఁడని నిశ్చయించి
మనస్సున తొక్కటపడుచున్నిందు కేమి యుపాయము సేయుదునని తలచుచుం
డున వసరంబున దాని యభిప్రాయ మెరుగని జారుఁడు శంకతో నిట్లనియెం.
ఓం ప్రియురాలా నీకు నామీఁద మిక్కిలి తలపున్నదా లేక నీ మగనిమీఁద మిక్కిలి
తలపున్నదా నిజముగా జెప్పుము నీవు కలిగిన మాట చెప్పకపోతివా నాకు కోప
ము వచ్చునని పలికిన పద్మముఖి యిట్లనియె- ఓరి దురాత్మా దానివు నా మొగని
కాలిగోరునకు బోలుదువా నాకు మగనిమీఁద నున్న తలపు నీయందుండునా స్త్రీలు
యౌవనగర్వముచేత నిలువలేక జారులతో పొందు చేసితే పెనిమిటిమీఁది మో
హము తక్కువ బడునా మొగఁడు దేహము విడిచిపోవునపుడు భార్య యతనితోఁ
గూడా నగ్నిలోఁ బడుటవల్ల స్త్రీ నేరక యొక చెడుపని చేసియున్నా ఆ పాపము
పోవును దంపతులు ఇహలోకమునందును పరలోకమునందున్ను ఎడబాయక
నుందురు అని చెప్పగా మంచముకిందనున్న రథకారుడు సంతోషపడి నిండా
ప్రీతిగలిగిన స్త్రీ ఒకనాడు ప్రియపడి మరియొక పురుషుని బిలిచితే దానివల్లనే
మి తప్పున్నదని కోపము విడిచి శాంతుండై యుండెను పద్మముఖి జారుని తోషమునన్నట్లు వ
చ్చినట్లు క్రీడించి సుఖనిద్రెంజెందె నా పిమ్మట రథకారుడు సంతోషముతో నా
మంచము నెత్తికొని వచ్చినడివీనిలో దించెను అప్పుడే జారుడు తొలగిపోయెను
రథకారుండేమియు ననక భార్యను బిలుచుకొని తన యింటికి బోయెను కాబట్టి చేసి
న దోషము ప్రత్యక్షముగా నుండగా మూఢుడు మంచి మాటల చేత సంతోషించు
నని చెప్పి మఱియు ననేకవిధములు రక్తాక్షుడు చెప్పిన ఉపమర్దుడు రక్తా
క్షుడైతని మాటలాదరింపక చిరంజీవిని బిలుచుకొని తన నివాసములకు బో
యి అతని నత్యంత గౌరవంబునం గొలిపించుకొని యుండెను

ఒకనాడు చిరంజీవి వచ్చి ఉపమర్దనునకు మ్రొక్కి అయ్యా
శివగవానియొంటనీ గుణములు నేను స్తోత్రము సేసినందుకు బహు కోపముతో
నన్నవమానము సేసెను ప్రాణములు తీపని నేను బ్రతికియుండవోల్ను- అ
వమానపడ్డవాడు బ్రతుకేందుకు నేనగ్నిలో బ్రవేశించి దేహము చాలించెదను
నాకెవ్వరు నడ్డము రాకుండుడని పలికెను చిరంజీవి చెప్పిన మాటలన్ని విని రక్తా
క్షుడు వారి మనసు దెలుసుకొందమని వానిం జూచి నీవు వచ్చి యేమి సేయగల

అనియడిగెను తాను వచ్చినట్లు బలహీనుఁడుగా పుట్టి శత్రువుగా కాకకులము నెల్లనా
శాంతుఁడీరుసట్లు గాబట్టి చంపుదుననిచిరంజీవి చెప్పెను ఈవిధముగా జేయుట
నీకు సాధ్యముతోల్ని సూర్యుని మేఘుని వాయువును పర్వతమును భర్తగానుద్దే
శించి ఒకముని కతన జన్మము మరలఁ బొందినట్లు ఉత్కృష్టజన్మము సరవ్తో
నేరదన్యోన్నత రక్తాక్షుఁడు పలికెను అదియెట్లు వివరముగా నాకు చెప్పుమని చి
రంజీవియడిగినందుకు రక్తాక్షుండు చెప్పుచున్నాఁడు

—— చిరంజీవికి రక్తాక్షుఁడు చెప్పిన యెలుకకథ ——

ఒకమునీశ్వరుఁడు పుణ్యనదులలో మేటియగు గంగానదిలో సూర్యోద
యసమయమున స్నానముచేసి అర్ఘ్య జలము దోసిటఁ బట్టుకొనియుండగా ఒక
డేగ యెలుకను నోటకరచుకొని ఆకాశవీధిని బోవుచుండగా ఆయెలుక డేగకా
ళ్ళలోనుంచి వదిలి ఆ ముని దోసిటిలో బడెను అప్పుడు ముని దయగలవాఁడై యీ
యెలుక కన్యక యగుఁగాకయనిన అది కన్యకగా నాయెను ఆముని ఆకన్యకను తన భా
ర్యచేతికిచ్చిన ఆమె దాన్ని తాను కన్న కూఁతురి కంటె నెక్కువ మక్కువతో పెం
చుచుండగా యౌవనము వచ్చెను అప్పుడా ముని మిక్కిలి మనోహరమైన ఆకా
రముగల చిన్నదానిఁ జూచి ఇది పెండ్లిగాక మునుపు రజస్వలయైన తేవృషలీపతి
యనబడును కాబట్టి తగినవరుని విచారించి త్వరగా దీనికి పెండ్లి సేయవలెనని
యెంచి మహాలోకములను ప్రకాశింపజేయుచున్న సూర్యు నిందలంచి ప్రత్యక్షమై
న సూర్యుఁడు ప్రసన్నుండై ముందట నిలిచి నీకేమి కావలెనని యడిగెను అ
య్యా యీ రూపవతియైన చిన్నదాని పెండ్లియాడుటకు మనుష్యులర్హులుగారని
వివాహము సేయక నిలిపియున్నాను దీనిని భార్యగా మీరు పరిగ్రహింపవలెనని ఇది
నాకోరికయని ముని చెప్పెను అంతట నాసూర్యుఁడు దాని మూలకముగా నెవ్వరి
పరిహరింపవలదిట ఓముని మేఘుఁడు నాప్రకాశమును మరుగుపఱచుచున్నాఁడు అ
తఁడు నాకంటె బలవంతుఁడు అతనికి నీకన్య నిచ్చి పెండ్లిజేసి తగియుండునని ఆ
ముని మేఘుని ప్రార్థించిన మేఘుఁడు ప్రత్యక్షుఁడై యున్న స్నేలరప్పించి దివ్వనియడి
గెను అయ్యా ఇది నాకోమార్తె దీనిని భార్యగా పరిగ్రహింపవలెనని కన్యకను జూ
పెను మేఘుఁడు ఓముని వర్షమును వాయువు ననుఁ జూచి వాయువు నన్ను చెదరఁగొట్టుచు
న్నాఁడు వాయువు నాకంటె బలవంతుఁడు నీకూఁతురు నతనికిచ్చి తే తగియుండును
గాని యితరులకిచ్చుట తగదని మృదువాక్యములచేత నతని సత్కరించి వెడలిపోయెను.
పిమ్మట ఆముని వాయుదేవు నారాధించిన నతండు చనుదెంచి యెదుట నిలిచి నన్ను
దలచిన కార్యమేమి యనియడిగెను ఆముని తనకన్యకను అతనికిం జూపి ఇది నాకూఁ
తురు దీనిని మిక్కిలి ప్రీతితో బలిమిగా పెంచితిని తగిన వరునకిచ్చి వివాహము జేయ

వలయూవనితలంవుపుట్టినన్ను ప్రార్థించితివి ఈకన్యకనుమనుష్యులకిచ్చుటనా
కుసమ్మతిలేదు జగత్ప్రాణుండవైననీకు నీవ్వంగలంచితివనినీవుదయచేసి ఈక
న్యం బెండ్లియాడదలచెను అందువల్లనేనుకృతార్థుడనగుదునని చెప్పెను ఆమాట
వాయుదేవుడువిని నేనందరినిచలింపజేయుదును పర్వతమును మాత్రము కదిలిం
చలేను నాకంటె పర్వతమునకు అధికబలము కాబట్టి నీకొమార్తెను పర్వతమునకి
చ్చి పెండ్లిచేసితే బహుసుఖించెదనని చెప్పి యాతనిచేత సెలవుపుచ్చుకొని తనస్థలము
కుబోయెను అటువెనుక ఆముని పర్వతములలో శ్రేష్ఠమైన మేరుపర్వతము
నారాధించగానే మేరువు దివ్యరూపముధరించి మునియెదుటనిలిచి నావల్లనీకు
కావలసిన ప్రయోజనమేమి యనిఅడిగెను రూపవతియగు నాకూతురిని యావ
నశాలివై సుందరాకారుడవైననీకిచ్చి పెండ్లిజేయవలెనని ప్రార్థించితిని అని
మునిపలికెను మేరుపర్వతము ఆమాటవిని ఓమునీ మూషకము మాచితెకొంచెము
గానబడుచున్నది దానిశక్తియేమని చెప్పవచ్చును బహుశ్రమముగాను దే
దుపర్వతములనుతొలచి బొక్కలుచేయుచున్నది కాబట్టి నాకంటె మూషకముబల
శాలినీకూతురిని మూషకమునకిచ్చి పెండ్లిచేసితే చక్కగానుండునని చెప్పితన
స్థానమునకుబోయెను తదనంతరము ఆఋషి ఆచిన్నదాని వెంటబెట్టుకొని ఋ
ష్యాశ్రమముకుబోయి యీచిన్నదాని పెండ్లిచేసుకొండని బ్రాహ్మణోత్తము
లతో జెప్పినంత చక్కనిచిన్నది యీయింటనుండదగదు రాజులకైతే యోగ్యము
గానుండును మాకువద్దు మీరుపొండని బ్రాహ్మణోత్తములు చెప్పిరి అంతట ఆ
ఋషి ఎండాసిగ్గుపడి తనయింటికి వచ్చి యిది పెండ్లిగాకమునుపు రజస్వలయయి
తే ధర్మహానియగును కాబట్టి పూర్వరూపము ధరించి సంచరించుగాకయని పలికి
ననది మూషికయయ్యెను ఆవృద్ధఋషి ఒక మొగయెలుకను చూచి యీయా
డయెలుకను దానికి జంటగట్టిపెడిచెను మునికి సూర్య మేఘ వాయు మేరుపర్వత
ములను ప్రత్యక్షము చేసుకొనునంత శక్తిగలిగియుండిన్ని దానియెలుకజన్మము
ను మాన్పగూడకపోయెను.

అని పలికిన నుపమర్దుడను రక్తాక్షుని పలుకులనాదరింపక చిరంజీవింజూచి చే
రంబిలిచి యభయ మిచ్చి ఓ చిరంజీవీ నీవు స్వేచ్ఛగా నాయింటనుండుమని యా
తనికి నాహారము మొదలైనవి యిచ్చుచుండెను దన పరిచారకులని రా
గించి బహుప్రీతిగానుండెను అటువెనక చిరంజీవి కొంతకాలం బుండి శత్రువులకు
కలిగినబలంబును మర్మస్థానంబులను రహస్య మార్గంబులను దెలుసుకొని
శత్రువులను నాశము సేయుటకిది మంచిసమయమని యెంచి యొకనాడు ప్రొద్దు
న నులూకంబులు దేహము మరచి నిద్రపోవుచుండగా మునుపు గుహచుట్టును
ఆవులమందలుండుటవల్ల జేరిన పెంపునుకొక్కరించికొంత ముక్కునంగఱచు

కొని కొంతకాలుండన్నుకొని తీసుకపోయి గుహాద్వారంబుల యందెల్ల నించి
ఘూకంబులం జారజూచిన నమ్మినయీగుడ్లగూబల జంపుటవల్ల నాకు దోష
ము లేదు శత్రువును నమ్మించక నేచంపగూడదు నన్ను ముఖ్యముగా నమ్మిన మే
ఘవర్ణునకు హితము సేయవలెను యేలినవాడు సేవకునికి నేపని చెప్పుచు
న్నాడో ఆపని దీర్చవచ్చుట యతనికి ధర్మము ఇటువంటి విషయములో పాపపు
ణ్యములు ప్రభువునకేవచ్చునుగాని భృత్యునికేమి నిమిత్తము మేఘవర్ణునకీస
మాయంబు తెలియజేయవలయునని తలంచి జివ్వున మేఘవర్ణుని యొద్దకిబోయి
యతనికి మ్రొక్కి తాను తగసాధించుటకు యుక్తమైన కాలముగని పెట్టి మీకు తె
లియజేయవచ్చితిని వెనకనా సమాచారమంతయు చెప్పెదను ఇప్పుడు మన వా
రందరు పుల్లలు తృణములను ముక్కున గఱచుకొని వచ్చునట్లుగా నియమిం
చుడని చెప్పి తాను ముందుచున్న కొఱవి యొకటి నేర్పుగా ముక్కున గరచు
కొని ముందుగా నడిచెను కాకములన్నియు తృణకాష్ఠములు ముక్కున గఱచుకొ
ని చిరంజీవితోగూడ శత్రువులను గెలుచుటకై వేడుకతో నాకాశమార్గమున
నెగరి గుడ్లగూబలున్న గుహా వాకిట తృణకాష్ఠములు నించుచుండిన చిరంజీవి తన
ముక్కున గఱచుకొనివచ్చిన కొఱవి తగిలించిన ఱెక్కలతో విసిరిన మండుచు
నతర్వాత పొగలున్న మంటలున్న అగ్నిమై గుహాలో ప్రవేశించగా గుడ్ల
గూబలు భయభ్రాంతములై యెక్కడిక్కులకు బరుగెత్తి గుహలోనుంచి వెళ్లి
పోవుటకు నెక్కడ ద్వారము గానక ఏగచుచుండిన గర్తాక్షుండు దన స్వామి
యైన ఉపమర్దునితో గనువచ్చి చిరంజీవిని జంపరాదని మీరును మీమంత్రులును
జెప్పితిరి. ఇప్పుడీ ప్రకారముగా ననుభవింపవలసివచ్చెను ఇటువంటి పాపమె
క్కడనైనా కద్దా తనకు హితుడైన మంత్రిమాటలను వినని రాజు బంధుమిత్రస
హితముగా విపత్తును బొందునని పలికెను ఉపమర్దుడు ఖిన్నుడై ప్రతికూల
మైన కాలమునందు ప్రాణులకు ధర్మము ధర్మముగా దోచును చెడుదోవ మంచి
దోవగాను గుపడును శత్రువు మిత్రువుగాను గనుపడును కాబట్టి నాకు నీ వెంత హి
తముగా చెప్పినా వినక చిరంజీవిని పరిగ్రహించి యముని దగ్గరికి బోవుటకు మా
ర్గము చేసుకొంటిని దైవము విల్లిచ్చిన నేనేమి సేయవచ్చును పూ
ర్వమొకప్పుడు అక్షౌహిణీతో పాండవబలంబుండగా నిశీథవేళ అశ్వత్థామ ఒక
డే వారిని సంహారింపుచుండు సమయములో శ్రీకృష్ణస్వామి అక్కడనుండిన్ని
వారింపజాలెనా దైవకృత్యము దప్పింపనెవరిచేతనౌను చెప్పుము అంతలో
మంటలధికమైనందున గుడ్లగూబలన్ని చచ్చిపోయెను - అప్పుడు కాకులు సంతో
షించి నిజనివాసములకు బోయెను

అక్కడ మేఘవర్ణుడు మహావైభవముతో గొలువైయుండి చిరంజీవిం జూచి ఆలింగనము చేసికొని లెస్సగా సన్మానించి ఇన్నిదినములు శత్రువులనడుమ నెట్లుగా నేకధమున గొలిచియుంటివి నాకు విన్నవించుమనిన నతం డిట్లనియె అయ్యా కార్యార్థియైనవాడు ఒకవేళ వట్టినేలను బండుకొనును ఒకవేళ మంచి మెత్తని పరుపులమీద బండుకొనును ఒకవేళ కూరగాయలు దినును ఒకవేళ షడ్రసోపేతమైన శాల్యన్నమును భక్షించుచు ఒకవేళ బొంత కప్పుకొనును ఒకవేళ మంచిసన్నబట్టలుగట్టుకొనును దుఃఖమును సుఖమును మనస్సున నెంచడు అనువుగాని వేళయందధిక సామర్థ్యముగలవాడైనను శత్రువులనైనా సేవించి సమయము వచ్చినప్పుడు శత్రువులను గెలుచును సకలదిక్కులనుండెడు రాజులను పరాక్రమము చేత గెలుచునట్టి తమ్ములుగల యుధిష్ఠిరుడు అనుకూలము గాని వేళ దన తమ్ములతో గూడా సకల కష్టముల ననుభవించుచు మత్స్యదేశాధిపతియైన విరాటరాజు దగ్గిర కావివస్త్రములు గట్టుకొని కంకుభట్టను పేరుచేత యుధిష్ఠిరుండుండెను వలలుడను పేరుచేత వంటలవాడై భీముడు కాలము గడిపెను పేడియై స్త్రీలకు నాట్యము నేర్పుచు బృహన్నలయను పేరుచేత నర్జునుడు వర్తించెను తంత్రిపాలుడను పేరుచేత నకులుండశ్వశిక్షకుండాయెను - దామగ్రంధి యను పేరుచేత సహదేవుండాలగాపరిగానుండెను తర్వాత కాలము ననుకూలించి రాగానే దుర్యోధనుడు మొదలుగాగల శత్రువులనందరిని గెలిచి సకలసామ్రాజ్యముల ననుభవించిరి కాబట్టి నేను మహాహీనమైనదశచేతను శత్రువులను గొలిచి పగసాధించితిని అని చిరంజీవి చెప్పిన మేఘవర్ణుడాదరంబుగా నతని వీక్షించి శత్రుమధ్యమునందు కొంచెమయినా శంక లేక ధైర్యముతో నెట్లు వర్తించితివి చెప్పుమనిన చిరంజీవి యిట్లనియె దేవా వినుము ఉలూకపతియైన ఉపమర్దునిమంత్రులలో రక్తాక్షుండను వాడు నీతిశాస్త్రము చక్కగా దెలిసినవాడు సజ్జనులకు ప్రియుడు పరాక్రమము గలవాడు క్రూరము గాని నడవడిక గలవాడు సర్వజనముల చేత స్తోత్రము చేయబడినవాడు నాకంటె బుద్ధిబలముగలవాడు నన్ను జంపవలెనని ఉపమర్దునితో నెంత జెప్పినా అతడు వినక ఇతరమైన మంత్రులతో నాలోచన చేసి శరణాగతుని జంపగూడదని వారు చెప్పగా వారిమాటవిని నన్నదనయింటికి బిలుచుకొని పోయి యింత దెచ్చుకొనెను నీవతిసమర్థుడవు గావున శత్రువులం గెలిచితివి తనకు సమయముగానప్పుడు శత్రువులకు లొంగియుండి తర్వాత శత్రువులను గెలుచుట మంచిది మును పొక కృష్ణసర్పము కప్పలను దన వీపున మోసిన సమయము వచ్చినప్పుడన్నిటిని జంపెను.

## మేఘవర్ణునకుసంజీవకుడుచెప్పినకృష్ణసర్పముకథ

మందవిషుండను పేరుగలయొకసర్పము ఆకలిచేత తిరుగుచుండి కప్పలు గలయొక కొలనిసమీపమునకుంబోయి జలపాదుండను కప్పనుజూచి మ్లానదీనత్వముతో హీనమైనకంఠస్వరమున నిట్లనియె నాపొట్టకొఱకు నెవరి నడుగకుండా ఇదివరకు కాలముగడిపితిని ఇప్పుడు మీకు భృత్యుడనై యుండవలసివచ్చెను నేనేమి సేయుదును నన్ను దైవము ఈగతికి దెచ్చెను అనిన మండూకాధీశ్వరుండగు జలపాదుండు విని మమ్మిప్పుడాశ్రయించుటకు గార్యంబేమియని యడిగిన మందవిషుండిట్లనియె నిన్న అర్ధరాత్రివేళ ఆకటిచేతఁబట్టుదిరుగుచుండగా నొక బ్రాహ్మణకుమారుడు వచ్చి కానక నన్నుదొక్కెను నేనత్యుగ్రముగా వానిఁగఱచితిని అంతట వాఁడు విషమెక్కి మూర్ఛిల్లగా నా చిన్నవాని తండ్రి చూచి మిక్కిలి దిగులుపడి మంత్రవాదులను బిలుచుకొని వచ్చి మంత్రించి మందు ఇప్పించి ఆతని బ్రతికించుకొని నన్ను మనస్సులోఁ గలచి అధికమైన కోపముతో నన్ను లెక్కచేసుకొని తనబంధువులంజూచి నా చిన్నవానిఁగఱచిన చెడుపురుగు తనకు నాహారమైన కప్పలను మోసి మిక్కిలి యాకటిచే డస్సి పరుగెత్తలేక ఆకప్పలు దయచేసి యిచ్చిన యాహారమును భక్షించి వాటిలో నొకటై సంచరించుగాకయని నన్ను శపించెను నేనచ్చటి సమీపమందున్న పుట్టలో నుండి ఈమాటలన్నివింటిని పిడుగుదెబ్బనైనా తప్పించవచ్చును గాని బ్రాహ్మణుని శాపము దప్పించుకొనగూడదు ఇప్పుడు నీ వేదిక్కని వచ్చినాను దయతో నన్ను దగ్గిరదీసి నీభృత్యునిగా నేలి నాకింత యాహారమిచ్చి శాపాడ్డలెను మునుపు మా పెద్దలు వివేకము లేనందున మీతో మైత్రి సేయనొల్లక విరోధము చేసికొని వారేమి సుఖము జెందిరి ఇప్పుడు మీకు నేను మైత్రితో వుండగలనని చెప్పగా మండూకరాజు సంతోషించి ఆ పాము వీపుమీద నెక్కి కూర్చుండిన తనిమంత్రులున్ను వచ్చి తమ రాజుతో గూడా వీపెక్కి కూర్చుండిరి అంతట మందవిషుడు కొంతసేపు తిరిగి అలసిన వానివలె మెల్లగా నడుచుచుండెను జలపాదుడు మెల్లగా నడిచెద వేమని అడిగెను ఆహారము లేదుగనుక నడవలేక చిక్కితిని మీరివ్వకుంటే నాకాహారమెక్కడిది ఇప్పుడు నాకేమైనా ఆహారమిచ్చి ఆఁకలి తీర్చకపోతే ప్రాణములుఁబోవునని మందవిషుండు పలికెను ఈమాట మండూకరాజువిని పాపమునకు రుణించి ఈకొలనిలో నుండు కప్పలను నీకు కావలసినమట్టుకు నాయాజ్ఞమీద భక్షించి శీఘ్రముగా వచ్చి నాకు వాహనకార్యము నెరవేర్చుమని చెప్పెను మందవిషుడు మహాప్రసాదంబని ఆతనిని తనమంత్రులతో నచ్చట దించి జలమధ్యమునకుబోయి కావలసిన కప్పలను భక్షించి వచ్చి మునుపటివలెనే వాహనకృత్యము చేసె

ఈప్రకారముగా గొన్నిదినములకు జలపాదుడప్పగొలని లోకప్పలు లే
నందున కడపటజలపాదుని భక్షించవలయునని యాతనిదగ్గిరికి వచ్చి అతని భక్షిం
చి సర్పము స్వేచ్ఛగాబోయెను. కనుక శత్రువులనాశ్రయించి పగ సాధించితిని
అగ్ని యడవిని దహించునపుడు చెట్లుమొగల్లు బొత్తిగా నశింపవు తిరుగా చిగిరించు
ను అటువలెనే శత్రువులను గొందఱిని నశింపజేసి కొందఱిని నిలిపితే కొన్నాళ్లకు
వారు తిరుగా బలవంతులై వత్తురు. అగ్నిశేషము ఋణశేషము రోగశేషము శత్రు
శేషము నిలిచియుంటే నానాటికి వృద్ధిబొందును కాబట్టి శత్రుశేషంబుంచగూ
డదు. నీవు నిశ్శేషముగా శత్రువులను సంహరించిన భాగ్యవంతుడవు రాజ్యవ్య
సనములయందాసక్తుడు గాక ప్రజలను సంతోషపెట్టుచు కామక్రోధలోభ
మోహమదమాత్సర్యములను విసర్జించి సత్యము ధర్మము శౌచము సహన
ము మొదలైన సుగుణములుగలవాడై తన ఛిద్రములను పరులెఱుంగనీయక పరమను
ష్యులఛిద్రములు తెలుసుకొనుచు దేశకాలములనుపట్టి స్వామి అమాత్యులు
సుహృత్తులు కోశము రాష్ట్రము దుర్గము బలము అనియేడు సప్తాంగములను రక్షిం
చుకొనుచు మహాధార్మికుడని జనులచేత స్తోత్రము చేయబడి తనకీర్తి దిక్కుల
యందు ప్రకాశింపజేసెను. అతడు దేవాంశమువల్ల బుట్టినవాడని తెలియదగ్గది
శూరుడు తీక్ష్ణమైన ఆయుధములచేతను యుద్ధభూమియందు చెదిరింగిన శత్రువు
లను మాత్రము చంపును గాని బహుసైన్యములను చంపలేడు గాని ఉపాయ
ముచేతనైతే శత్రువులను పుత్రమిత్రకళత్రబంధుసహితముగా నశింపజే
యును. ఒకనికి నుద్యోగించినా దైవము ననుకూలించి తలపని సిద్ధించును. ఆదైవము
ప్రతికూలించితే పురుషప్రయత్నము నిరర్థకము. దశరథరాముడు తాపసవేషము
ధరించెను. బలిచక్రవర్తి బంధింపబడెను. పాండుపుత్రులు వనవాసము జేసి
రి. యాదవులొకరినొకరు గొట్టుకొని చచ్చిరి. నళమహారాజు సకలకష్టములను అను
భవించెను. భీష్ముడు శరతల్పమునందు బండెను. నారాయణుడు వామనా
కారముదాల్చెను. రావణాసురుడు కార్తవీర్యార్జునుని పరాక్రమమునకు నొదిగి
యుండెను. ఈజగంబు సర్వంబును దైవప్రయత్నమువల్ల జరుగుచుండును. మూ
ఢుడైనవాడు ఇది తెలుసుకోలేడు. బుద్ధిమంతుడైనవాడు తెలుసుకొని స్థిరచిత్తు
డైయుండును. శాస్త్రముచేత బుద్ధి స్వచ్ఛంబు. జలముచేత సరస్సు చంద్రుని చేత
రాత్రి సతిచేత వారకతనము అలంకరింపబడును. సూర్యుడు చీకటిని హ
రించిన ఉపకారాదులను సుకృతముచేత కృతఘ్నత్వమును వేషముచే

నాడు మొసలికొన్ని మేడిపండ్లు దీసుకొని యింటికి బోయెను తన భార్య దూరము నుంచి యతనిం జూచి వెంటికిరయిలము రాచుకొని చెలికత్తెలు చుట్టుగూర్చుండి యుండగా బండుకొనియుండెను అటువంటి భార్యను జూచి మొసలి మిక్కిలి విషాదమును బొంది దీని దేహ మేమి యెందుకు బండుకొన్నదని దాని చెలికత్తెల నడిగెను దీనికసాధ్యమైన రోగము వచ్చినది యిదివరకు బ్రతికియుండుట యెక్కువ నిన్ను జూచి ప్రాణములు విడిచెదననియాశచేత బ్రతికియున్నదని యొకతె చెప్పెను ఆమాట మొసలి విని దిగులుపడి నా ప్రాణమైనా యిచ్చి దీనిం బ్రతికింప వలయునని పలికెను పిమ్మట సఖి మొసలిం జూచి నేను వైద్యునిం బిలుచుకొని వచ్చి నీ భార్యను జూపించి వాని నతడు చూచి కోతిగుండెకాయ దొరికితే మందు జేసియిచ్చెదను ఆమందువలన బ్రతుకును లేకుంటే బ్రతకదని చెప్పినాడు నేను అప్పుడు క్రకచుడు దనలో నిట్లని యాలోచనసేసెను ఇదియేమి కష్టము సంభవించెను బలవర్ధనుడు వినాగా నాకు కోతియెక్కడ దొరుకును గుండెకాయ నెక్కడి సంచిదెత్తును వానిజంపితె బహుదోషము భార్యను బ్రతికించుట ముఖ్యకార్యము మిత్రుడు మంచిగుణములుగలవాడు ఇద్దరిలో భార్యను మిత్రునికంటె అధికురాలు కాబట్టి మిత్రునిజంపి భార్యను బ్రతికించుట ధర్మము అని నిశ్చయించుకొని బలవర్ధనుని సమీపమునకు మెల్లగా బోయెను మెల్లగా వచ్చుచున్న మొసలిం జూచి నీ వెందుకు మెల్లగా నడుచుచున్నావని బలవర్ధనుడడిగెను నీతో గూడి బహుదినములు స్నేహము చేసినాను గనుక నిన్ను మాయింటికి నొకసారైన నాపిలుచుకొని పోకపోతినని సంకోచము చేత మెల్లగా నడుచుచున్నాను ఈలోకములో వారు తమకొక ప్రయోజనమును నుద్దేశించి యొకరిని ప్రీతి చేయుచున్నారు నీవు ప్రయోజనమును నుద్దేశింపక నెదయగలవాడవు అని మొసలి చెప్పెను ఓయీ యిది యొకయుపకారమా నీతో కూడా సంతోషముగా నిచ్చట వాసము చేయుచు రాజ్యము తొలగిపోయినందున వచ్చిన దుఃఖమును పోగొట్టుకొనుచున్నాను దుఃఖమును భయమును బోగొట్టి రక్షించునట్టి శ్రేష్ఠమైన మిత్రుడు ప్రతికి నమ్మికను పాత్రుండు మిత్ర అను నీయీ అక్షరద్వయము నెవడు కల్పించినాడో వాడు మహాపుణ్యాత్ముడు అని వానరుడు పలికెను మొసలి యామాటవిని సంతోషించి నీవు నావీపు మీద నెక్కి మాయిల్లు చూడరావలసినదని చెప్పెను బలవర్ధనుడు మంచిదని మొసలివీపున నెక్కెను

తర్వాత మొసలి బలవర్ధనుని వీపుమీద నెక్కించుకొని నడుచుచు నిట్లని వితర్కించెను ఇప్పుడు స్త్రీకార్యము గొప్పచేసి మిత్రుని జంపుచున్నాను ఇది మహాదారుణమైనపని నేను సిందపాలయినసె బంగారము యొక్క గుణములు తె

లుసుకోవలెనంటే యొకగంటిమీద నెకసి తెలుసుకోవచ్చును పురుషునిగు
ణములు తెలుసుకోవలెనంటే యతనినడవడికవలన తెలుసుకోవచ్చును వృష
భముయొక్క గుణము తెలుసుకోవలెనంటే భారమువహింపచేసి తెలుసు
కోవచ్చును స్త్రీగుణములు తెలుసుకోవలెనంటే యేయుపాయము చేతనున్ను
యెంతబుద్ధిమంతుడయినా తెలుసుకోలేడిటువంటిస్త్రీ నిమిత్తము నేను మిత్రవ
ధయెల్లచేయుననిపలికెంచుసమయంబున బలవద్ధనుండామాటవినియో స్నే
హితుడాయిప్పుడు నీ వేమిచెప్పితివని మొసలినడిగెను యేమిలేదని మొసలిచె
ప్పినదిచెప్పనందున వానరుడు సందేహించి నేనడిగితే మొసలియేమిన్ని చెప్పక
పోయెనిందుకు హేతువేమి నేనువీనిమనసులోమాటనా ప్రజ్ఞచేత బయిటికిదీ
సెదననినిశ్చయించి యో స్నేహితుడా యిట్లోమాచెలియలయిన నీ భార్యసు
ఖముగానున్నదాయ నేనునీ చెల్లెలు అసాధ్యమయినవ్యాధిచేత పీడింపబడి
యున్నది బ్రతుకుటకష్టమని మొసలి చెప్పెను వైద్యులకు మాంత్రికులకు జూపిం
చిన వ్యాధికేమయినా ప్రతిక్రియ చేయించలేదాయని వానరుడడిగెను వైద్యు
లనడిగితే కోతిగుండెకాయతో మందుచేసియిస్తేనే కాని బ్రతకదని వారుచెప్పి
రని ప్రియురాలినిగురించి దుఃఖముచేత దెలివిలేక మొసలి వానరునికి బ్రత్యు
త్తరమిచ్చెను వానరుడామాటవిని తనప్రాణములుపోయినవని యెంచుకొని అ
య్యో వ్యర్థముగా జచ్చిపోతిని వృద్ధత్వమునందున్నింద్రియములనుజయించనివా

డయినందున నీ ఫలము ననుభవింపుచున్నాను రాగముతో గూడుకొన్నవాడరణ్యా
మున బహుకాలమున్నా ఫలములేదు యింద్రియనిగ్రహముగలవాడిల్లువదల
కనున్నను తపస్సు సిద్ధించును రాగమువిడిచి వినయశీలుండయి శమార్థశా
ము లెరిగి సత్యదయాదానశౌచములుగలిగి నావానికి గృహమే తపోవనము దండ

ములు కావిచీరెలు తలబోడచేయించుకొనుట భిక్షమెత్తుట చదువుట వీటిచేత దప
స్సుసిద్ధింపదని తనమనంబునం జింతించి దైవవశంబున నొకయుపాయముదోచి
మొసలితో నిట్లనియె-ఓ స్నేహితుడా నీవు పిచ్చి పనిచేసితివి-ఈమాటముందే
లచెప్పకపోయినావు నాహృదయమునప్పే తెలిసియుంటే ఆ గుండె నేనుకూడా నె[illegible]కొ
నివత్తును నే నమ్ముసలి వాడనైనందున మోయలేక నాగుండెకాయ ఆచెట్టుగొ
మ్మను బెట్టియున్నాను ఇప్పుడదితీసుకొనిపోవుట యుక్తము ధర్మమును అర్థమును కా
మమును కోరినవారు బ్రాహ్మణుని రాజును స్త్రీని రిక్తహస్తముల జూడబోరు నీవు
బుద్ధిహీనుడవైయీసంగతిముందే నాతో జెప్పనందున కార్యమునకు గొడవవ
చ్చెనని చెప్పగా మొసలివిని మనమిప్పుడు తిరిగిపోయి గుండెకాయ తీసుకొ
నివత్తుము దానిచేతనే కదా నా భార్యప్రాణములు రక్షింపబడును అని మెడిచె

ములుబహువిఘ్నములుగలవిగానుండునుఅనిచెప్పఁగాఁ గాకి దేవిని నేనుని
తోగూడావచ్చెదనని చెప్పెను అంతటనక్క నీవు భయపడకరమ్మనన్న నమ్మ
మని చెప్పి బుద్ధిలేనిగాడిదెను తిరుగాఁ దీసుకొనిపోయి సింహమునకు నొప్పగిం
చెను తర్వాత సింహము దానిం బ్రీతిగాఁ జేపట్టుకొని చంపినక్క నుజూచి నీవు
చురస్తరమైన కార్యము చేసినావు నీవంటి సమర్థులేలోకమున లేరుఅని భాషిం
చినీవు క్షణమాత్రము దీనికసిపెట్టుకొనియుండుము నేను స్నానముచేసి నిత్యక
ర్మముదీర్చుకొనివచ్చి యీయాహారమును భక్షింపుచున్నా ననిసింహముపో
గానేయిది యేమోమహౌషధమని యెంచి గాడిదెచెవులుగుండెకాయన
క్క తానే భక్షించెను తర్వాత సింహమువచ్చి గాడిదెచెవులుగుండెకాయ
యెక్కడబోయినవని యడిగెను బుద్ధిహీనుని చెవులుగుండెకాయ యాసుండు
నాఅవియుంటే వాడికెందుకవుననినక్క ప్రత్యుత్తరమిచ్చెను కాబోలున
ని సింహమూరకుండెను కాబట్టి నేను మొసలికోతినిగాను గాడిదెనుగానని చె
ప్పి తిరిగి ఇంక నన్ను వంచింపనీకు శక్యముగాదు నీవుపోయి కీళ్లుదాగుచుండవ
లసినదిఅని వానరము చెప్పఁగావిని మొసలి దొరికినలబ్ధము పోఁగొట్టుకొనిపో
యెనుఅని విష్ణుశర్మ చెప్పినలబ్ధనాశనంబను నాలవతంత్రము విని రాచకొమా
ళ్లు చాలా సంతోషము నొందిరి ॥ లబ్ధనాశనమను నాలవతంత్రము ముగిసెను ॥

## అసంప్రేక్ష్యకారిత్వమను అయిదవతంత్రము,

నిజముగల్లయుం దెలియనేరక క్రోధముచేత నుజనులకెగ్గుచేసినవాఁడు
పామునుజంపినముంగిసను వధించిన బ్రాహ్మణుఁడువలె మహత్తైనమ
నోవ్యధను బొందునని విష్ణుశర్మ చెప్పఁగా రాజపుత్రులు విని ముంగిస పాము
నెందుకుజంపెను ఆ ముంగిసను బ్రాహ్మణుఁ డేలవధించెను మాకుదెలియఁజె
ప్పవలయుననిన విష్ణుశర్మ యిట్లనియె గౌడదేశంబున నొకయగ్రహారంబుగల
దు అందు దేవశర్మయను బ్రాహ్మణుఁడు కలఁడు ఆయన భార్య యజ్ఞసేన అనుపేరు
గలది ఆమె పురాకృతపుణ్యముచేత గర్భంబు ధరించెను బ్రాహ్మణుఁడామె
ను జూచి నిండా సంతోషించి అనంతములైనకోరికెలుగోరుచు ఓప్రియురాలా
నీగర్భమునందున్న కొమారుఁడు మనకులమెల్ల నుద్ధరింపగలవాఁడు మహాభాగ్య
వంతుఁడని చెప్పెను భార్య పెనిమిటిని జూచి ఇటువంటికోరికలుగోరుట యుక్త
ముగాదు అనాగతకార్యములను గురించి చింతయొనరుచు చేయుచున్నాడో వా
డు సోమశర్మతండ్రివలెను మిక్కిలి విషాదమునుబొందునని పలికె అది యెట్లు
ని బ్రాహ్మణుఁడడుగఁగా వాని భార్య చెప్పుచున్నది ॥ పేలపిండికథ, ॥

ర్వాతస్నానము జేసి ఆముగ్గురుని దుడ్డుకఱ్ఱతో నెత్తిమీదగొట్టుము అటుపిమ్మ
ట నాముగ్గురును సువర్ణనిధులవుదురు ఆనిధులనుంచుకొని సకలధర్మములు
చేయుచు బుత్రపౌత్రాభివృద్ధిగా చిరకాలము బ్రతుకుమని యాశీర్వదించి అ
దృశ్యుడై పోయెను అంతట నాకోమటి విన్నవాడు మేల్కాంచి యీకలగనిన
వాడు తలపుగా నిద్రబోకగూడకుండగనే సూర్యోదయకాలమువరకు నిద్రపోక కూ
ర్చుండి యుండి యాసూర్యోదయమైనతర్వాత దానిని తలచి నేడు మనకొక మే
లుగలుగబోవుచున్నది యిపుడు మంగలివాడు మొదలయినది చక్కగా శాస్త్రి జేసినయెడ
వరాలనైయుండుదుము నేను క్షౌరాభ్యంగనములు చేయించుకొని స్నా
నముజేసి శుచినై యుండెదనని ఒక్కమంగలవానిం బిలుపించి క్షౌరము చేయిం
చుకొని వానిం గొంచెము సేపునిలువుమని చెప్పి అభ్యంగనస్నానము చేసిమ
డివస్త్రములుగట్టుకొని శుచినై యుండెను అనంతరము సిద్ధపురుషుడు చెప్పి
న ప్రకారముగా భిక్షుకులు ముగ్గురు వచ్చిరి వారిని వైశ్యుడు సాదరముగ చూచి పూ
జించి షడ్రసోపేతముగా భోజనము పెట్టించి వారిని తృప్తిబొందించి తర్వాత దుడ్డు
కఱ్ఱగైకొని వారి నెత్తిమీదగొట్టెను అప్పుడా ముగ్గురు వరాలకుప్పలైరి అం
దుకు వాడు సంతోషించి దానితో సహా ధనసహితమై తనయిల్లు ప్రవేశించెను మం
గలవానికి నూరువరాలిచ్చి పంపించెను ఆసంగతి లెస్సగా విచారించని మం
గలవాడిది చూచి యింటికిబోయి నేనును భిక్షుకులను ముగ్గురిని జంపి ధన
ము సంపాదించెదనని నిశ్చయించుకొని భిక్షుకులకు నెదురుచూచుచుండెను క
ర్మవశమువల్ల ముగ్గురుభిక్షుకులువచ్చిరి మంగలవాడు జూచి సంతోషించి పూ
జించి తృప్తిగా భోజనము పెట్టించి దుడ్డుకఱ్ఱతో గొట్టి వారినిజంపెను అయితే
వరాలకుప్పలు దొరకకపోయెను ఈసమాచారము రాజభటులు విని మంగల
వానినీడ్చుకొనిపోయి రాజుతో జెప్పి రాజాజ్ఞమీద వానిజంపిరి కాబట్టి ఎవడు లె
స్సగా జాడక చక్కగా విచారింపక ఆపని చేయునో వాడు భిక్షుకులను జంపి
న మంగలవానివలెను ఆపదలను బొందునని చెప్పితిని యేకార్యమైనా త్వరప
డి చేయరాదు త్వరపడి చేసినయెడల విపత్కి నాపదలువచ్చుట సిద్ధము లెస్సగా విమ
ర్శించి చేసినపనికే కకసాపదలువచ్చునని భార్య చెప్పినవిని బ్రాహ్మణుడు దా
నివివేకవచనంబులకు సంతోషంబును విచారించక తాను ముంగిసనిజంపుటకు బరి
తాపంబునొందిన చిత్తంబుతో సర్వంబును దైవాధీనంబని పలికి తనకుమారుని
లాలింపుచు భార్యయుందాను సుఖంబుననుండిరని విష్ణుశర్మ చెప్పినపంచతం
త్రంబు విని యారాజనందనులు అత్యంతసంతోషభరితులైరి. సంపూర్ణము.